విజయ అనుబంధం

# సహవాసం

సి. ఆనందారామం

'విజయ' అనుబంధ మాలికలో

వెలువడ్డ ఏడవ నవల

విజయ
80. ధనలక్ష్మి కాలనీ
మద్రాసు-26

## విజయ అనుబంధం

'VIJAYA' SUPPLEMENT No: 8
JULY 1976

'SUDHARMA'

BY C. ANANDARAMAM

వెల : చెల్లింపలేనిది
(ఇది 'విజయ' పత్రికతో పాఠకులకు
యివ్వబడ్డ అమూల్య కానుక)



ప్రింటర్స్ :
విజయా గ్రాఫిక్స్,
8, ఆర్కాట్ రోడ్,
మద్రాసు-600 026.

# సమస్య

సి. ఆనందారామం

ఆ అమ్మాయి తెల్లగా, సన్నగా, పొడుగ్గా, నాజుగ్గా ఉంది. ముఖం ఆకర్షణీయంగా ఉంది, కళకళలాడుతూ ఉంది. తెలివిగల ముఖంలా ఉంద. నడక మరీ వయ్యారంగా లేదు. విలాసంగా లేదు. కాని ఒకవిధమయిన లయతో అందంగా ఉంది. నుదుటిమీది చమట చేతిరుమాలుతో తుడుచుకుంటుంది. అలా తుడుచుకోవటంలో అలసట వున్నా విసుగు లేదు. చక చక నడుస్తోంది.

"ఎక్స్క్యూజ్ మి, నాకు కొంచెం సాయం చెయ్యగలరా?"

తను దూరంనుంచి తన్మయత్వంతో చూస్తోన్న సుందరి తననే సమీపించి, తననే పలకరించటంతో సంభ్రమంతో వుక్కిరిబిక్కిరయిపోయి "ష్యూర్" అన్నాడు వేంకటాచలపతి.

"నా సూట్‌కేస్ కొంచెం దూరం తీసుకురాగలరా?"

ఆవిడ అలాటి సాయం కోరినందుకు కొంచెం ప్రాణం ఉసూరుమన్నా "ష్యూర్! ష్యూర్!" అంటూ ఆ సూట్‌కేస్ అందుకున్నాడు. బరువుగానే ఉంది సూట్‌కేస్.

"మీరేం చేస్తున్నారు ఇక్కడ?" బరువు దింపుకుని, హాయిగా చేతులూపుకుంటూ అడిగింది ఆ అమ్మాయి.

ఆ అమ్మాయితో సగర్వంగా చెప్పుకోగలిగే ఉద్యోగం తనకు లేనందుకు కొంచెం కించపడ్డాడు వేంకటాచలపతి.

"ఏదో చిన్న ఉద్యోగం! అందాకా కాలక్షేపానికి ప్రభుత్వం నడుపుతున్న రాత్రి పాఠశాలలో సింగిల్ టీచర్ని"-ఆ చిన్న ఉద్యోగం కోసం తను పడ్డ పాట్లు గుర్తుచేసుకోకుండా ఉండడానికి ప్రయత్నిస్తూ తేలిగ్గా నవ్వాడు.

"ఐడియల్ జాబ్!" అంది ఆ అమ్మాయి.

ఆశించని ఈ ప్రశంసకు ఉప్పొంగిపోతూ "అవునవును!"అన్నాడు

"ఈ రకంగా మీకు ప్రజాసేవచేసే అవకాశం ఉంది"

"చాలా ఉంది."

"మీ వృత్తికి మీరు గర్వపడవచ్చును"

"గర్వపడుతున్నాను"

"వాళ్ళకి చదువు చెప్పటం కష్టంగాలేదూ?"

"లేదు"

"లేదూ? వాళ్ళు బాగా పాఠాలు అవగాహన చేసుకుంటున్నారా?"

"వాళ్ళెవరూ చదువుకోవటానికి రారు!"

ఆ అమ్మాయి నడుస్తున్నది ఒక్కక్షణం ఆగిపోయి, అతని ముఖంలోకి చూసి నవ్వింది. అతనూ నవ్వేడు ఆ నవ్వుచూసి....

"ఎవ్వరూ రాకపోతే, బడి ఎలా నడుస్తుంది?"

"నలుగురు కుర్రాళ్ళు....అంటే యువకులు....అంటే పెద్ద వాళ్ళు కాని వాళ్ళు...."

"మీరు పాఠాలు బాగా చెప్పగలరు?"

"చెప్పగలను"

"పోనీయండి"! నలుగురికి చదువు చెప్పగలిగినా చెప్పగలిగి నట్లే!"

"కాని, వాళ్ళు చదువుకోవటానికి రారు - నాతో చదరంగం ఆడటానికి వస్తారు"

"అయితే మీరు, వాళ్ళతో చదరంగం ఆడుతూఉంటారా?"

"ఏం చెయ్యను ఆడక? చదువు చెప్తానంటే వాళ్ళు రారు! వాళ్ళుకూడా రాకపోతే బడి మూతపడుతుంది"



విజయ

"బాగుంది."

"పదరంగం చాలా బాగుంటుంది."

"అదొకటేనా, ఇంకా ఏమైనా ఆడుకుంటారా?"

"బళ్ళో ఇవొక్కటే. చీట్లపేక మొదలైనవన్నీ గుళ్ళో ఆడతారు."

"ఎక్సలెంట్?"

"మిమ్మల్ని గురించి తెలుసుకోవచ్చా?"

"ఎందుకు తెలుసుకో కూడదూ?"

"అయితే చెప్పండి."

"ఏం చెప్పను?"

"మీ పేరు?"

"నిర్మల"

"చాలా బాగుంది. పేరుకి తగినట్లే ఉన్నారు."

"అంటే?"

అతను తబ్బిబ్బుపడి "మీ రూపంకూడా నిర్మలంగానే ఉందని" అన్నాడు.

"రూపం అందంగా ఉంటుంది. వికారంగా ఉంటుంది. నిర్మలంగా ఉండడమేమిటి."

"అదే మీ మనసు!"

"మనసు ఎప్పుడూ ఒకలా ఉంటుందా? క్షణానికి తొంభై రకాలుగా ఉంటుంది. ప్రస్తుతం నా మనసు ఏ మాత్రం నిర్మలంగా లేదు. పరమ చికాగ్గా ఉంది...."

"ఎందుకూ!"

"వెధవ ఊరు. దిగగానే ఆటో అయినా కనపడలేదు...."

"రిక్షాలున్నాయి...."

"నాకు రిక్షాలు ఎక్కాలనిపించదు - పాపం. ఆ పీదవాడు మనని, మన సామానునీ మోస్తుంటే భరించలేను....

"అవునవును!" బరువుగావున్న సూట్‌కేస్ ఒక చేతినుండి మరోచేతికి మార్చుకున్నాడు.

"అయినా మన సామాను మనం మోసుకోవటానికి నామోషీ అయితే ఎలా చెప్పండి."

"అందులో చిన్న తనం ఏం లేదు—" మళ్ళీ సూట్ కేసు మరో చేతికి మార్చుకొన్నాడు.

"బి. ఏ. పాసయినా నా పనులన్నీ నేనే చేసుకుంటాను."

"బి. ఏ. పాసయ్యారా?"

"అవును"

"ఇక్కడికి ఏదైనా పనిమీద వచ్చారా?"

"అవును"

"ఎక్కడ వుంటారు ఇక్కడ?"

"'సుధర్మ' లో"

అదిరిపడి "ఎక్కడా?" అన్నాడు మళ్ళీ తను సరిగా వినలేదేమోనని.

ఆ అమ్మాయి నొక్కినొక్కి స్పష్టంగా "సుధర్మలో" అంది.

"సుధర్మలో వుంటారా మీరు?"

"అవును- అక్కడే వుంటాను. అక్కడ పనిచెయ్యటానికే వచ్చాను."

అతడు తన చేతిలోని సూట్ కేసును ధన్‌మని నేలమీద పడేసాడు. ఆ అమ్మాయిని పురుగును చూసినట్లు చూసి ముఖం తిప్పుకుని చరచరా వెళ్ళిపోయాడు.

క్రిందపడ్డ సూట్ కేస్‌నీ వెళుతున్న వేంకటాచలపతినీ చూస్తూ నిలబడ్డ నిర్మల దగ్గరకొచ్చాడు పోలీస్ కానిస్టేబుల్ రాఘవయ్య.... "ఊరికి కొత్తదానిలా వున్నావే." అని పలకరించాడు. ఊళ్ళో అందరూ అతనికి తెలుసు, ఎవరినైనా అతను ముందు ఏకవచనంలోనే పలకరిస్తాడు. సందర్భాన్నిబట్టి తర్వాత చూసుకోవచ్చునని....

"అవును."

"ఎక్కడికి పోవాలి?"

"సుధర్మకి."

రాఘవయ్య హుషారుగా ఈలవేసాడు.

"భయం లేదులే. నేనొక కంట కనిపెట్టివుంటాను"

"నాకిప్పుడే భయంగా వుంది!"
"ఎందుకు? నేను తోడుగా రానా?"
"రా! ఆ సూట్‌కేస్ కాస్త తీసుకురా!"
సూట్‌కేస్ చేతితో పట్టుకుని "పద" అన్నాడు రాఘవయ్య.

## 2

అది దగ్గిర దగ్గిర నాలుగువేల గజాల విశాలమైన స్థలం. ఒకప్పుడది ఎవరో జమీందారుకి చెందిన స్థలం. జమీందారులు పోయిన తరువాత అతని వారసులు ఉన్న ఆస్తిని ఏదో ఒక ధరకి అమ్మేసి ఆ ఊరినుంచే వెళ్ళిపోయారు. ఆ స్థలాన్ని మాత్రం ఎవరు ఎవరికి అమ్మారో తెలియదు. ఆ స్థలంలోనే మధ్యలో పూర్తిగా శిధిలావస్థలోవున్న ఒక భవనం వుంది. అది రెండస్థుల భవనం కావచ్చు. పై అంతస్థు పూర్తిగాకూలిపోయి గబ్బిలాలు నివాసం ఏర్పరుచుకున్నాయి. క్రింది అంతస్థులో తలుపులు విరిగి, కిటికీలు ఊడి రెండు గదులున్నాయి. ఆ భవనం ఒకప్పటి జమీందారు తన ఉంపుడుకత్తె కోసం కట్టించిందని చెప్పుకుంటారు. ఆవిడకెవరైనా వారసులున్నారో, లేదో తెలియదు. మొత్తంమీద ఆ ఇల్లు ఫలానివారిది అని చెప్పటానికి వీల్లేకుండా, ఎవరు అమ్మినా, మరొకరు దెబ్బలాడటానికి వీలుగా ఉంది. ఆ రెండు గదుల్లోను నలుగురు కుర్రాళ్ళు హాయిగా ఉంటున్నారు. ఆ నలుగురికీ కూడా తమ తలిదండ్రులెవరో తెలియదు. గమ్మత్తుగా నలుగురు ఒకటిగా కూడారు

ఒకడు నరసింహం-'సిమ్హం' అని పిలుస్తారు వాడిని. ఒక సైకిలు షాపు యజమాని చేతికింద పని చేస్తున్నాడు.

మరొకడు యాదగిరి. "గిరయ్య"గా ప్రసిద్ధికెక్కాడు. ఒక చిన్నా పెద్దా కాని కల్లు దుకాణంలో సర్వర్ అనిపించుకోవటానికి వీల్లేని సర్వర్ ఉద్యోగం చేస్తున్నాడు. ఆ కల్లుదుకాణానికి రకరకాల మనుష్యులొస్తారు. వాళ్ళందరి కథలూ తన కథాకథన

చాతుర్యంతో రక్తిగా చెప్పగలడు గిరయ్య. ఆ కారణంచేత మిత్ర బృందంలో అతనికి చాలా గౌరవం వుంది.

మూడో వాడు రాధాకృష్ణ. స్వీపర్‌గా పనిచేస్తున్నాడు. చెత్త బండి మీద ఎక్కి రోడ్లన్నీ తిరుగుతూ గరుత్మంతుడి మీద విహరిస్తున్నట్లే మురిసిపోతాడు. 'కిట్టయ్యా!' అంటారు వాడిని.

నాలుగోవాడు బుజ్జి- వాడికా పేరు ఎవరు పెట్టారో, అసలు పేరేమిటో ఎవరికీ తెలియదు. బుజ్జి కా పేరు నచ్చక 'షోకు పేర్లు' తనకుతానే చాలా పెట్టుకున్నాడు. కాని అందరూ బుజ్జిఅనే పిలవడంతో విసుగుపుట్టి పేర్లగురించి ఆలోచించటం మానుకున్నాడు. వాడికి ఏ ఉద్యోగమూ లేదు- ఏ మేస్త్రీ చేతికిందో కూలీగా దొరికిన నాడు పని చేసుకుంటాడు. వాడికి జ్యోతిష్యం పిచ్చి చాలా వుంది.

రకరకాల గీతలూ, బొమ్మలూ గీసి ఎప్పుడు ఏం జరగబోతుందో సునాయాసంగా చెప్పగలిగే జ్యోతిష్యం శాస్త్రిఇగారంటే వాడికి చాలా గురి, తనకు మరో వుద్యోగం ఎప్పుడు దొరుకుతుందో అని ఇంచుమించు రోజూ శాస్త్రిలుగారిని అడుగుతూనేవుంటాడు బుజ్జి.

ఎక్కడ ఏ కొంచెం ఖాళీస్థలం కనబడ్డా గుడిసెలు వేసుకునే కూలీజనం అక్కడ చాలా గుడిసెలు వేసుకున్నారు. ఉగర దగ్గిర దెబ్బయి కుటుంబాలదాకా అక్కడ గుడిసెల్లో కాపురాలు వుంటున్నారు.

అక్కడే ఒక చిన్న బల్లమీద టీ దుకాణం ప్రారంభించాడు కాసులయ్య. ఆ ఊళ్ళో పాడి బాగానే వుంది. పాలు సమృద్ధిగానే దొరుకుతాయి, అయినా క్యాన్లపడి పాలపొడి సంపాదించి ఆ పొడితో తయారు చేసిన పాలు మంచిపాలలో కలిపి టీ తయారు చేస్తాడు. "దీనివల్ల నీకు పెద్ద లాభం లేదు కదా! ఎందుకంత ప్రయాస?" అని ఎవరైనా అడిగితే "మోసం చెయ్యకపోతే నా అంతరాత్మ చాలా బాధపడుతుంది. అంతరాత్మకు వ్యతిరేకంగా నడవటం చాలా పాపం!" అంటాడు సిన్సియర్‌గా.

ఇటీవల అతనికొక పార్ట్నరు కలిసాడు. అతని పేరేమిటో తెలియక అందరూ పార్టనరు అనే అంటారు. వారి వారి వుచ్ఛారణ సామర్థ్యాన్ని బట్టి 'పార్ట్నర్' శబ్దమే రకరకాలుగా విని

పిస్తుంది. పార్టనరు కలవగానే చూస్తుండగా కాసులయ్య ఇల్లులాటిదే కట్టేసి ఒక మోస్తరు కాఫీ హోటలే నడపటం మొదలు పెట్టాడు. "ఈ స్థలం అంతా నాదే! నేను కొనేసాను. మీరంతా లేవండి!" అని గుడిసెల్లో వాళ్ళని లేపగొట్టాలని చూశాడు. కాని 'మాయ కాలం' వొచ్చిపడింది. జనం హుషారయి పోయారు. "ఏంటి! మా కళ్ల ముందు బల్లదుకాణం పెట్టినోడివి ఈ జాగా అంతా కొన్నావా? అన్నీ పైసలే వుంటే, ఈ బడ్డీదుకాణం కరమేం నీకు! మేం లెగమంటే లెగం! ఏం సేస్తావో సేసుకో!" మన్నారు. కాసులయ్య ఏం చెయ్య లేదు. "పాపం బీదా బిక్కీ వున్నపళంగా లేచిపొమ్మంటే ఎక్కడికి పోతారు?" అని ఔదార్యం ప్రకటించాడు.

ఈ స్థలానికి కొంచెం దూరంలోనే వుంది ప్రభుత్వం రాత్రి నడుపుతున్న పాఠశాల. దాని కానుకునే వేంకటాచలపతి మాష్టారు వుంటోన్న చిన్న రెండు గదుల పెంకుటిల్లు వుంది.

వేంకటాచలపతి మాష్టారు హోమియోపతిలో డిప్లమా కూడా తీసుకున్నారు. ఆ చుట్టుపక్కల జనానికి చిన్న చిన్న జ్వరాలకీ, మామూలు జబ్బులకీ హోమియోపతి మందులిస్తారు. అంచేత జనం అతణ్ణి డాక్టరు - పంతులు అంటారు. కుర్రాళ్ళు నలుగురికీ డాక్టరు - పంతులు అంటే ప్రాణం. అడిగినపుడల్లా లేదనకుండా అప్పులిస్తాడు, ఎప్పుడిచ్చాడో, ఎంతిచ్చాడో మరిచిపోతాడు. ఇంత మంచివాళ్ళు ఎక్కడుంటారు?....

డాక్టరు-పంతులు తన ఇంట్లో అశాంతిగా అటూ ఇటూ తిరుగుతున్నాడు. ఎంత ప్రయత్నించినా నిర్మల రూపం అతని మనసును వదిలిపెట్టటం లేదు. ఆ భావంనుండి బయట పడాలని "బజారు మనిషి-చెడిపోయిన మనిషి" అనుకున్నాడు. అయినా మనసు మళ్ళీ ఆ మూర్తితోనే నిండిపోతోంది. కొంత విషాదం లేకపోలేదు. కాని ఆ మూర్తి మాత్రం పోవటం లేదు. అక్కడితో అదేదో తిరుమంత్రం లాగ "బజారు మనిషి, చెడిపోయిన మనిషి" అని జపించుకోవటం మొదలెట్టాడు.

కొంచెంసేపు లోలోపల అనుకున్నా ఆ మాటల్ని మనసు

స్వీకరించకపోవటంతో వాళ్ళమంది గట్టిగా అనుకోవటం మొద లెట్టాడు.

"బజారుమనిషి కాదు, బాగా చదువుకున్నమనిషి; చెడిపోయిన మనిషి కాదు, మంచి వుద్యోగంలోవున్న మనిషి" అప్పుడే లోపలకు వచ్చిన బుజ్జి కోపంగా అన్నాడు.

డాక్టరు - పంతులు ఆశగా చూస్తూ "నిజంగానా? నీ కెవరు చెప్పారు" అన్నాడు.

"శాస్త్రిలుగారు చెప్పారు."

"ఆయనకెలా తెలుసు?"

"ఆయనకన్నీ తెలుసు."

"ఇంకా ఏం చెప్పారు?"

"ఆ అమ్మాయి నిన్ను ప్రేమిస్తుందని చెప్పారు."

"నన్ను ప్రేమిస్తుందన్నారా?"

"నిన్ను కాదు, నన్ను! శాస్త్రిగారు నిన్నంటే—నన్ను...."

"ఛ! ఏమిటిరా వాగుతున్నావ్?"

"అంతే పంతులూ! ఆ శాస్త్రిగారు అట్టాగే చెప్పారు. నాకు కాలూ చెయ్యీ ఆడకుండావుంది" బావురుమన్నాడు బుజ్జి. డాక్టరు-పంతులుకి తలా తోకా అర్థం కాలేదు. నెమ్మదిగా బుజ్జిని బుజ్జగించి అసలు విషయం తెలుసుకునేసరికి తాతలు దిగొచ్చారు. బుజ్జిని బాగా చదువుకున్న వుద్యోగస్థురాలు ప్రేమిస్తుందని శాస్త్రిగారు జోస్యం చెప్పారు. నవ్వాలో ఏడ్వాలో అర్థంకాక ఏడుస్తున్న బుజ్జిని "ఊరుకో అదంతా ఏం జరగదులే!" అని ఓదార్చబోయాడు. బుజ్జి మరింతగా ఏడుస్తూ "జ్యోతిష్యం తప్పదు పంతులూ" అన్నాడు.

"పోనీ మంచిదేగా." అన్నాడు పంతులు విసిగి.

బుజ్జి కళ్ళు పెద్దవిచేసి భయంగా చూస్తూ "ఏం పంతులూ! చదువుకున్న అమ్మాయితో నేనేం మాట్లాడను? నాకేవి వస్తాయి?.... పూలయిపోనా?" అన్నాడు బెంగగా.

కుర్రాళ్ళు నలుగురికీ వుద్యోగరీత్యా సంఘంలో పై స్థాయి వాళ్ళతోకలిసి తిరగటంతో మాటలో యాసఅంతగా వుండదు.ఇంగ్లీషు

మాటలు మాత్రం అపభ్రంశ రూపాలతో పుంఖానుపుంఖాలుగా దొర్లుతూ వుంటాయి.

డాక్టరు పంతులు నవ్వాపుకోలేక పకపక నవ్వేసాడు. బుజ్జి రోషం తెచ్చుకుని "ఏంటి డాక్టరు పంతులూ, నవ్వుతున్నావా? తలుసు కుంటే నేను అయ్యన్నీ నేర్చుకోలేనా?" అన్నాడు.

పంతులు నవ్వుతూనే "నేర్చుకో!" అన్నాడు.

"సదువంతా వద్దు-అంతా రావటం కష్టం- కొంచెం నేర్చు కుంటాను."

"ఎంత కొంచెం నేర్పమంటావు?"

"ఇంగ్లీషులో 'అలో' అనటం నేర్పండి-ఇంగ్లీషులో ఆచ్చర్య పోటం నేర్పండి. లవ్వు డైలాగులన్నీ నేర్పండి...."

"అలాగే!"

బుజ్జి కొంచెంసేపాగి "ఎందుకైనా మంచిది. ఇంగ్లీషులో ఏడ్డంకూడా నేర్పండి-" అన్నాడు.

"తప్పకుండా నేర్పుతాను. నువ్వెళ్ళు" అన్నాడు పంతులు విసుగ్గా. బుజ్జి తన "భవనానికి" వచ్చి మిత్రులతో తన గోడు వెళ్ళబోసు కున్నాడు. మిత్రబృందం అతణ్ణి ఓదార్చి. "వురేయ్! సుకాల్లోనే కాదురా! కస్టాల్లోకూడా మనవంతా ఒకటేరా! మేం కూడా నీతో అయ్యన్నీ నేర్చుకుంటాం? గుబులుపడకు" అని భరాసా ఇచ్చారు.

సివ్వానికి మంచికంటె చెడు ఆలోచించటమే ఇష్టం.

"ఒరేయ్! ఆ శాస్త్రులుగారు ప్రేమిస్తాదని మాత్రమే చెప్పాడా? పెళ్ళాడతాదనికూడా చెప్పాడ్రా?" అని అడిగాడు.

బుజ్జి బాగా ఆలోచించి గుర్తుచేసుకుంటూ "పెళ్ళాడతాదని చెప్ప లేడు" అన్నాడు.

"వురేయ్!" ఎవరో గొప్పింటి అమ్మాయి నిన్ను ప్రేమిస్తా దనుకో! ఆళ్ళయ్యకి అదిస్టంకాక. నిన్ను గుండాలతో చావబాదిస్తే?...."

బుజ్జి కెవ్వున కేకేసి పక్కనున్న గిరయ్యని గట్టిగా వాటేసు కున్నాడు. ఈసారి వాడిని ఓదార్చటానికి ఎవరికీ గుండెలు చాలలేదు.

"పినిస్" అన్నాడు సివ్వం చాలా స్టయిల్‌గా....

# 3

లోలోపలి వణుకూ, కంగారూ, దడా- అన్నీ అణచుకుంటూ ఎంతో హుందాగా కనపడాలని ఠీవిగా అడుగులు వేసుకుంటూ "సుధర్మ" లో అడుగుపెట్టాడు వేంకటాచలపతి. అతడు అంతకు ముందెప్పుడూ అక్కడికి రాలేదు. అసలు ఆ ఊళ్ళో "సుధర్మ" వెలసి కూడా రెండునెలలే అయింది. "లంజల కంపెనీకి భలేపేరు పెట్టారు" అనుకోవడం విన్నాడేకాని, అక్కడివాళ్ళని అతనెప్పుడూ చూడలేదు. కథల్లోనూ, నవలల్లోనూ చదవటమేతప్ప అలాంటి కంపెనీలు ఎలా నడుస్తాయోకూడా అతనికి తెలియదు. మామూలుగా పెద్ద ఇళ్ళలో వున్నట్లే ఒక డ్రాయింగ్‌రూం ఉంది. మరో సోఫాసెట్ ఉంది. గోడలకి శృంగార దృశ్యాలేమీ లేవు. అందమైన ఒక సీనరీ ఉంది. ఒక సోఫాలో నడివయసు యువతి కూర్చుని ఉంది. ఆవిడే కంపెనీ యజమానురాలు కాబోలు! కారాకిళ్ళీ నమలటంలేదు. వెకిలినవ్వులు నవ్వటంలేదు. "రండి బాబుగారూ! మీ రాకతో మా గృహం ధన్యమయింది" అంటూ ఆహ్వానించటంలేదు. ఆవిడలో ఏదో హుందాతనం ఉంది. జుట్టు ముడివేసుకుంది. కళ్ళజోడు పెట్టుకుంది. ముఖం చూడగానే చదువూ సంస్కారమూ వున్న వ్యక్తిలాగ కనిపిస్తుంది.

"ఎవరు మీరు? ఏం కావాలి?" అంది మామూలుగా.

ఇదేమిటి? ఇలాంటి కంపెనీలలో ఇలా పలకరిస్తారా? డాక్టరు పంతులికి మోకాళ్ళు వణికాయి. అది గమనించి ఆవిడ నవ్వుతూ—

"కూర్చోండి—" అంది. వెంటనే కూర్చున్నాడు పంతులు.

"ఏం కావాలి?" అడిగింది మళ్ళీ సౌమ్యంగా....

"నిర్మల....నిర్మలగారు" గొంతు తడబడి పొడారిపోతుండగా అన్నాడు. ఆవిడ అతని వంకచూసి ప్రసన్నంగా నవ్వి "అదిగో! ఆ గదిలో ఉంది." అని ఒక గది చూపించింది.

డాక్టరు పంతులికి అంతా వింతగానే ఉంది. భయపడుతూ "నేను వెళ్ళచ్చునా?" అన్నాడు.

"వెళ్ళచ్చును!" అంది ఆవిడ

నిర్మల గది చాలా నీట్‌గా ఉంది. అక్కడ బొమ్మలూ లేవు. పువ్వులూ లేవు; ఇంకా తను కథల్లో చదివిన హంగామా ఏదీ లేదు. నిర్మల ఒక రాకింగ్ ఛైర్‌లో కాలుమీద కాలు వేసుకుని కూచుని అటూ ఇటూ ఊగుతూ ఏదో పుస్తకం చదువుతూంది. తలెత్తి చూసింది.

"ఓహో, మీరా! రండి" అని చిరునవ్వుతో ఆహ్వానించి కూర్చోవటానికి కుర్చీ చూపించింది....

కూర్చుంటూ "నేను 'అందుకు' రాలేదు" అన్నాడు కంగారుగా పంతులు.

"అందుకు—అంటే?"

పంతులికి కంగారు ఎక్కువవుతోంది. "అందరూ ఎందుకు వస్తారో అందుకు...." అన్నాడు.

"అందరూ ఎందుకొస్తారో, మీకేం తెలుసు? మీరేం సర్వజ్ఞులా? లేక సర్వాంతర్యాములా?"

"అందరూ అనుకోవటం...."

"అందరూ ఏది అనుకుంటే మీరు అదే అనుకుంటారా? ఆహా! ఏం పంతులు గారండీ, మీరు!"

"అయితే, అది నిజం కాదంటారా?"

"ఇప్పుడు మీరే వేరే కారణంతో వచ్చానని అంటున్నారుగా! అలాగే మిగిలినవాళ్ళకి వాళ్ళ వాళ్ళ కారణాలు వుండచ్చుగా!"

"వుండచ్చు!" మూఢుడిలా ఒప్పుకున్నాడు పంతులు.

"సరే! మీరెందుకు వచ్చారో చెప్పండి!"

"మీలాంటి అభాగ్యుల జీవితాలగురించి తెలుసుకుందామని.."

ఉదయం నుండే మనసులో ఎన్నోసార్లు మననం చేసుకున్న మాటలు ఎంతో హుందాగా అన్నాడు.

నిర్మల అత్యంతాశ్చర్యంగా కళ్ళు పెద్దవిచేసి "ఎవరు అభాగ్యులు?" అంది.

పంతులికి నోట మాట రాలేదు. "మీరే!" అనబోయి, ఆ ముఖం చూస్తూ అనలేక ఆ మాటలు లోపలికి తీసుకున్నాడు.

నిర్మల మళ్ళీ "అభాగ్యుల గురించి తెలుసుకోవటానికి నా దగ్గరకు రావటం దేనికి? మీరు తల ఎటుతిప్పినా కనిపించేది అభాగ్యులేగా!" అంది.

పంతులు గుటకమింగి "మిమ్మల్ని గురించి తెలుసుకుందామని...." అన్నాడు.

నిర్మల నవ్వుతూ "తెలుసుకుని ఏం చేస్తారు?" అంది.

"ఒక నవల రాస్తాను."

"వాట్? !! మీరు పంతులుగారు అని తెలుసుకోడానికే ఆశ్చర్యంగా వుంది- రచయితలు కూడానా?"

తన కంగారులో నిర్మల మాటల్లోని వ్యంగ్యం అతను పట్టించుకోలేదు.

"అంటే ఇంతవరకూ నేను ఏ నవలలూ ప్రచురించలేదు."

"ఓహో! అముద్రిత గ్రంథాల రచయిత అన్నమాట!"

"అముద్రిత గ్రంథాలుకూడా ఏమీ లేవు!"

"అదేం?"

"నేనే విషయమైనా ఆలోచిస్తున్నప్పుడు ఎంతో బ్రహ్మాండంగా తోస్తుంది. తీరా రాయబోయినప్పుడు అందులో సగంలో సగంకూడా రాదు!"

"అదృష్టవంతులు! ఆ మాత్రం గ్రహించగలిగారు!"

"అందరికీ అంతేనా?"

"ఏ విషయమైనా అంతే! ఆలోచనలో వున్నంత అందంగా ఆకారంలో వుండదు. ఆలోచనలో అంతా మంచే వుంటుంది. ఆకృతి దిద్దుకునేటప్పుడు తప్పకుండా మంచీ, చెడూ-రెండూ వుంటాయి."

"అయితే నేను రాయలేనంటారా?"

"ఎందుకు రాయలేరు? సృష్టి అంటే మంచి చెడ్డల కలయిక...."

"అయితే నేను రాస్తే బాగానే వస్తుందంటారా?"

"రాకపోవచ్చు...."

"రాకపోతే ఏం చెయ్యాలి?"

"చింపెయ్యాలి!"

పంతులు ఒక్క క్షణం గతుక్కుమని "థేంక్స్!" అన్నాడు నిర్మల సలహాకి.

"ఇంతకూ, నన్ను గురించి తెలుసుకుని నవల రాద్దామని వచ్చారా?"

"అవునవును!"

"అయితే వినండి! నేను చాలా సంపన్న కుటుంబంలో పుట్టకపోయినా బీదదానిని కాను. తల్లిదండ్రులు నన్ను అల్లారుముద్దుగా పెంచకపోయినా, బాగానే పెంచారు. ఇద్దరన్నలు, ఒక తమ్ముడు, ఒక చెల్లెలు. ఇద్దరన్నయ్యలూ మంచి ఉద్యోగాల్లోనే వున్నారు. తమ్ముడూ, చెల్లీ చదువుకుంటున్నారు...."

పంతులికి విసుగేస్తుంది. ఇదేం కథ? ఇంత మామూలుగా....

"నేను బి. ఏ. పాసయ్యాను. గోల్డ్ మెడల్ కూడా వచ్చింది. ఆ తరువాత ఒక రోజున... "

కొంచెం ఆగింది నిర్మల. పంతులు వుత్సుకతతో ముందుకు వంగి, "ఒక రోజున... " అన్నాడు.

"ఈ రకమైన జీవితం ఎలా వుంటుందో అని వుత్సుకత కలిగి ఈ వృత్తిలో ప్రవేశించాను."

"ఆ!" అన్నాడు పంతులు పూర్తిగా నోరు వెళ్ళబెట్టి....

గ్లాసుతో మంచినీళ్ళు అందించింది నిర్మల. అవి గడగడ త్రాగి కొంచెంతేరుకుని "మీ తల్లిదండ్రులు ఏమీ అనలేదా?"అన్నాడు.

"ఆడదానికి ఇలాంటి వృత్తి ప్రమాదకరమేమోనని హెచ్చరించారనుకోండి! అయినా మా కుటుంబంలో పిల్లల అభిరుచులకి పెద్దవాళ్ళు ఆటంకాలు చెప్పరు."

"చాలా ఆదర్శవంతమైన కుటుంబం."

"అవును. మీరు నవల రాస్తారా?"

"ఇదా? దీనితో నవల ఎలా వస్తుంది?"

"రచయిత గొప్పవాడయితే, దీనితో బ్రహ్మాండమయిన నవల రాయగలడు!"

"అయితే నేను రాస్తాను."

"రాస్తారా?"

"ఇప్పుడు కాదు. గొప్ప రచయిత నయ్యాక—"

నిర్మల నవ్వి "గుడ్" అంది.

పంతులు మొదట చూసినావిడ గది గుమ్మంలో నించుని "నిర్మలా! ఈ పూట ప్రార్థన కొస్తావా, రావా? టైం అయింది" అంది.

"వస్తున్నాను సరస్వతమ్మగారూ!" అని నిర్మల లేచి "మీరూ మా ప్రార్థన కొస్తారా?" అంది.

"వస్తాను." అన్నాడు పంతులు వీళ్ళ ప్రార్థనలెలావుంటాయో చూద్దామని. ఇంచుమించు పదిమంది అమ్మాయిలు వరుసగా చేతులు కట్టుకు నిల్చున్నారు. వాళ్ళలో అన్ని వయసుల వాళ్ళు వున్నారు. నిర్మల కూడా వాళ్ళ మధ్య నిలబడింది.

సరస్వతమ్మగారు మొదట అంటూంటే తరువాత అందరూ కలిపి ఆవే మాట లంటున్నారు.

"అత్యంత సుందరమైన సృష్టిలో అపురూపమైన ప్రాణిని నేను. నా విలువ నాకున్నది. నేనొకరిని చిన్నబుచ్చను. మరొకరికి నన్ను చిన్నబుచ్చే అవకాశం ఇవ్వను. సోమరితనమే నా శత్రువు. ఆత్మవిశ్వాసమే నాకు అంగరక్ష."

ప్రార్థన ముగిసాక పంతులు ఆశ్చర్యంగా "ఇదేం ప్రార్థన?"

"నన్ను క్షమిస్తే మీరీ జన్మలో రచయిత కాలేరు."

పంతులు ముఖం వేలాడేసుకొని "ఏం" అన్నాడు.

"పరంపరగా వచ్చే పాతచింతకాయ పచ్చడి భావాలు.... అంతకుముందే ఎవరో ఊహించి పెట్టిన సన్నివేశాలు....అందరూ యాంత్రికంగా అరిచే బోలు నీతిసూత్రాలు తప్ప మీ అంతట మీరుగా ఏ క్రొత్త విషయాన్నీ అర్థం చేసుకోటానికి ప్రయత్నించరేం?"

అంతలో అక్కడికి ఎవరో యువకుడు సూటూ బూటులో హుందాగా వచ్చాడు. అతణ్ణి చూడగానే నిర్మల సంభ్రమంగా పంతుల్ని పట్టించుకోకుండా అతనితో కలిసి తన గదిలోకి వెళ్ళిపో యింది. సరస్వతమ్మగారు "మీరు రండి?" అంటూ పంతుల్ని డ్రాయింగ్

రూంలోకి తీసికెళ్ళింది. పంతులు మనసు ఉడికిపోసాగింది. నిర్మల ఆ యువకుడితో ఏం మాట్లాడుతుందోనని అతని ప్రాణం కొట్టుకు పోతోంది. అయినా ఒక్క మాటకూడా వినబడటం లేదు. "ఆయన వెళ్ళేసరికి ఆలస్యం కావచ్చు. పోనీ, మీరు వెళ్ళి తరువాత రండి!" అంది సరస్వతమ్మ.

"పరవాలేదు-కూర్చుంటాను." అన్నాడు మొండిగా పంతులు. అతనికి కదలాలని లేదు.

సరస్వతమ్మ అన్నట్టే ఆ యువకుడు నిర్మల గదిలో గంట పైగానే కూచున్నాడు. అతణ్ణి సాగనంపటానికి బయటకు వచ్చిన నిర్మల పంతుల్ని చూచి ఆశ్చర్యపోతూ "అరె! మీరు వెళ్ళలేదా?" అంది.

"మీకోసమే ఉన్నాను."

"మీ స్కూల్‌కి టైం అవటంలేదూ?"

"ఏం పరవాలేదు. అక్కడి కెవరూ రారు."

నిర్మల రమ్మనకుండానే నిర్మల వెంట ఆవిడ గదికి వెళ్ళి పోయాడు పంతులు. తన కళ్ళముందు నిర్మల ఎవడో మొగాడితో గంటపైగా గదిలో కూచుని 'కులికే' సరికి నిర్మలతో ఏం మాట్లాడటాని కైనా ధైర్యం వచ్చేసింది పంతులికి.

"ఒక్క ప్రశ్న అడుగుతాను-ఇంత హీనంగా, నీచంగా బ్రతకటానికి మీకు సిగ్గుగా లేదూ?"

ప్రశ్న వింటూనే నిర్మల నిటారుగా నిలబడింది. కళ్ళలోంచి నిప్పులు కురుస్తున్నాయి.

"లేదు. పైగా నా వృత్తి ధర్మం నేను నిర్వర్తిస్తున్నానని గర్వంగా ఉంది. పదిమందికి చెప్పవలసిన పంతులివయి ఉండీ, నీ వృత్తి నువ్వు సరిగ్గా చేయకుండా, ఇంత హీనంగా..ఇంత నీచంగా... ఎంతో దరిద్రంగా....ఇలా నాముందు నిలబడటానికి నీకు సిగ్గుగా లేదా?"

గబాలున తలవంచుకున్నాడు పంతులు. అతని చేతిలో 'బ్లాంక్' గా ఉన్న తెల్లకాగితంలాగే తయారయింది అతని ముఖం.

పదో క్లాసు లక్ష్మి పంపుదగ్గర నీళ్ళు పడుతోంది. అది పదోక్లాసు పాసవలేదు. పదో క్లాసు వరకు చదివింది. అప్పటికి దానికి పాతికేళ్ళు కూడా వచ్చాయి. ఆ గుడిసెల్లో ఎవరూ పదో క్లాసువరకు చదవలేదు. తనొక్కర్తే చదివింది. స్కాలర్‌షిప్ వస్తుందని ఇంట్లో వాళ్ళు బడికి పంపించారు. మధ్యలో ఎక్కడా పరీక్షలు లేకపోవటంవల్ల ఝూం ఝంటూ పదోక్లాసు వరకు వచ్చేసి అక్కడ పబ్లిక్ పరీక్ష అడ్డం పడటంతో టక్కున ఆగిపోయింది. తన ఇంత గొప్ప పదో క్లాసు తన కెందుకూ పనికిరాకపోవటం దానికి చాలా బాధగా ఉంది. పంపు దగ్గర మిగిలిన వాళ్ళు నీళ్ళకోసం తనతో కాట్ల కుక్కల్లా పోట్లాడుతారు. తను పదోక్లాసు లక్ష్మిననే జ్ఞానం వాళ్ళకి ఏకోశానా లేదు. తనూ వాళ్ళతో సమంగా పోట్లాడగలదు. వాళ్ళకొచ్చినన్ని తిట్లు తనకూ వచ్చు. మరికాసిని ఇంగ్లీషు తిట్లుకూడా వచ్చు. వాళ్ళతో సమంగా చేతులు తిప్పుకుంటూ పోట్లాడుతూ, జబర్దస్తీగా తన బిందె పంపుక్రింద పెట్టెయ్యగలదు లక్ష్మి. ఎటొచ్చీ ఆపని చేస్తున్నప్పుడు తన క్లాస్‌మేట్స్ కాని, టీచర్స్ కాని, అటు వస్తారేమోనని ఒక కంట కనిపెడుతూ ఉంటుంది.

ఆ మధ్య నీళ్ళు పడుతున్నప్పుడు వెంకటరత్నం కనిపించి "హలో లక్ష్మీ!" అంది. సిగ్గుతో ప్రాణం పోయినట్లే అనిపించింది.

ఆ వెంకటరత్నం శుద్ధ మొద్దు - పరీక్ష పాసయిందంటే ఎలాగో పాసయింది. తనంత అందంగా ఉండదు. ఆ పేరు మాత్రం? పాతకాలపు మోటుపేరు. అయితేనేం? చక్కగా బస్‌స్టాప్ దగ్గర నిలబడి గర్వంగా పలకరిస్తోంది!

తనకూ ఉన్నాయి రెండునైలాను చీరలు....అవి కట్టుకుంటే తను బంగళాలో అమ్మాయిలాగే ఉంటుంది. కాని, బంగళాలో అమ్మాయిలు పంపు దగ్గిర నీళ్ళు పట్టుకోనక్కర్లేదు.

వెధవనీళ్ళు! వెధవబ్రతుకు!! కళ్ళంట నీళ్ళు తిరిగిపోతున్నాయి పదోక్లాసు లక్ష్మికి....

తండ్రి చెప్పుల షాపులో పనిచేస్తున్నాడు. బాగానే సంపాదిస్తాడు. సంపాదించిన దానిలో సగంపైగా త్రాగి ఇంటికొస్తాడు. ఎవరైనా ఏమైనా అంటే చావబాదేస్తాడు. అన్నకూడా ఆఫీసులో ప్యూన్ పని చేస్తున్నాడు. వచ్చిన దానిలో సగం పైగా సినిమాలకు తగలేస్తాడు. అన్ని సినిమాలూ రెండాటలూ చూస్తాడు. చూసినవే చూస్తాడు. అద్దంముందు నించుని ఆ యెదవ యేసాలన్నీ యేస్తాడు. సినిమాలో యేసంవొస్తుందనే ఆడి ఆశ... అమ్మకి ఒంట్లో ఓపిక లేదు అంతకు ముందు తొమ్మండుగురు పిల్లలు. మొన్న కాన్పులో కవలపిల్లలు పుట్టారు.

ఇంటి చాకిరీ అంతా తనే చెయ్యాలి. చాకిరీకి తను భయపడదు. ఎంతైనా చేస్తుంది ఇంట్లో అయితే! కానీ, అమ్మ బంగాళాల్లో చెయ్యమంటుంది! దరిద్రం! పదోక్లాసు చదివి బంగళాల్లో పని; చెయ్యనంటే చెయ్యనంది! అమ్మ కట్టెపేడు తీసుకుని చావబాదింది. తన పదోక్లాసు ఆ దెబ్బలని ఏ మాత్రం అడ్డుకోలేక పోయింది- చచ్చినట్టు పనిలో చేరింది.

అమ్మగారు మంచిదే! తనని చూసి అప్పుడప్పుడు లోలోపల నవ్వుకుంటుంది. కాని. చిన్నబుచ్చదు - "ఏమేవ్! ఒసేవ్!" అని పిలవదు. నైలాన్ చీరలిస్తుంది. అప్పుడప్పుడు గాజులు, రిబ్బన్లు కొనిపెడుతుంది.

అయినా. అమ్మగారిదగ్గిర కూడా తన పదోక్లాసు పనికిరాలేదు - అమ్మగారి ఇంట్లో నరసమ్మదే పెత్తనమంతా....నరసమ్మకి పని అంతా వచ్చునని. అన్నీ చూసుకోగలదని అమ్మగారికి గురి....ఏం చదువుకోని నరసమ్మ కింద పదోక్లాసు చదివిన తను- ఛీ! ఛీ!....ఒకసారి తను బియ్యం తీస్తుండగా అమ్మగారు చూసింది. "పదోక్లాసుదాకా చదివావు మళ్ళా! ఇదేంబుద్ధి?" అని చీదరించుకుంది. తన పదోక్లాసు చివరికి అలా పనికొచ్చింది. తనకెంతో ఏడుపొచ్చింది....తను దొంగదా? తనలో అసలు దొంగబుద్ధి లేనేలేదు. అమ్మ తెమ్మని చంపుతోంటే. అమ్మగారు అన్నీ తనముందు వదిలి,

ఎక్కడో, ఎవరితోనో మాట్లాడుతూ కూచుంటే ఏం చెయ్యాలి తీసుకోక? ఎవరైనా తీసుకుంటారు-అక్కడికీ మిగిలిపోయిన అన్నం. పప్పు, కూరలు, అమ్మగారిస్తే తను తీసికెళ్ళదు-ఇంటికెళ్ళి చెల్లెల్నో తమ్ముణ్ణో పంపిస్తుంది. ఇక్కడితో తన యాతన పూర్తికాలేదు. ఇంతకు మించిన యాతన-నరకయాతన ఉంది. అప్పులకి బయలు దేరడం! అమ్మ తననే పంపిస్తుంది అప్పులకి! తన ముఖంచూసి అప్పిస్తారని....అమ్మగారిదగ్గర జీతమంతా ముందే తీసేసుకుంటుంది.

ఇక బిందెలూ, చివరకు అమ్మ మంగళ సూత్రమూ తీసుకుని అప్పులకు బయలుదేరాలి! తాకట్టుపెట్టడమూ, వడ్డీలుకట్టడమూ, తాకట్టు విడిపించుకోవటమూ, మళ్ళీ తాకట్టు పెట్టటమూ... ఇది ఇంతే! దీనికి తుదీ మొదలూ లేదు.

అమ్మగారు పండక్కి కొన్న కొత్త వాయిల్ చీర కట్టుకుని - తలనిండా పువ్వులు పెట్టుకుని హాయిగా రోడ్డుమీద నడిచి వెళ్తున్నప్పుడు ఈ అప్పులు గుర్తుకొస్తే....ఓయ్! దేవుడా!

"ఏంటిలక్ష్మీ! హుషారుగాఉన్నావ్?" కన్నుకొట్టి నవ్వుతూ పలకరించాడు గిరయ్య.

"ఛ! పో!" వయ్యారంగా సిగ్గుపడుతూ విదిలించింది లక్ష్మి. తన్మయుడై పోయాడు గిరయ్య. గిరయ్య పెద్ద అందగాడు కాడు. మొన్న మొన్నటిపరకు లక్ష్మి కంటి కసలు గిరయ్య ఆనలేదు. "ఛ! గిరయ్య నా మొగుడేంటి?" అనుకుంది. పదోక్లాసు చదివిన తనకు ఎవరో పెద్ద మొగుడే వస్తాడనుకుంది. కానీ, ఈ మొగాళ్లు ....ఈళ్ళ కిదేం పొయ్యేకాలమోకాని, తన అందంచూసి గుటకలు మింగుతారే తప్ప....ఒక్కడూ ప్రేమించడు. అదంతా కథల్లోనే కాబోలు: ప్రతి ఒక్కడూ "నువ్వు పనిమనిషివి సుమా!" అన్నట్టు అల్లంతదూరాన నిలబెట్టే మాట్లాడతారు. తమలో కట్నాల బాధలేదు. ఎదురు ఓలి ఇచ్చి పెళ్ళాడాలి! పదోక్లాసు చదివిన అందమైన తనను ఒక "గొప్పోడు" ఎంతంటే అంత ఓలి ఇచ్చి పెళ్ళాడతాడని అనుకుంది.

తండ్రి రెండువందలరూపాయలకు తక్కువైతే ఇయ్యనన్నాడు. అంత ఓలి ఇయ్యటానికి ఎవడూ ముందుకురాలేదు. అసలు అమ్మా నాన్నలకి తనకు పెళ్ళి చెయ్యాలని లేదు.

డాక్టర్-పంతులు ఎటో చూస్తూ "నిర్మల చాలా మంచిది" అన్నాడు.

సివ్వం ఉలికిపడి "ఏంటిపంతులూ?" అన్నాడు.

డాక్టర్-పంతులు "ఆ...." అంటూ అయోమయంగా ఒక్క-క్షణంచూసి "ఏం లేదు పో!" అని కసిరాడు.

పరుగులతో, ఉరుకులతో తమ "భవనాని"కి చేరుకున్నాడు.

"డాక్టరు-పంతులు ఎల్లిపోతున్నాడు" అని వార్త అందించేసాడు.

"ఏంటి? ఏంటి?" అని గాభరాపడ్డారు మిగిలినముగ్గురూ. ఓపిగ్గా అంతా వివరించాడు సివ్వం.

"ఎందుకు? ఎందుకెళ్తున్నాడు పంతులు?" ఒకళ్ళ తరువాత ఒకళ్ళు అదే ప్రశ్న అడిగారు....

"నిర్మల చాలా మంచిది...." అచ్చు పంతులు అన్నట్లుగానే అన్నాడు సివ్వం....

మిగిలిన ముగ్గురూ సివ్వాన్ని విచిత్రంగా చూసారు. "ఒరేయ్! గాలేమైనా సోకిందా?" వెంగగా అడిగాడు కిట్టయ్య....

"డాక్టర్-పంతులు అలాగే అన్నాడు. అంతకంటే ఏం చెప్పలేదు."

"నిర్మలంటే ఎవురూ?" ఆశ్చర్యంగా అడిగాడు కిట్టయ్య.

"కంపెనీలోఉంటది. అవిడ బాగుంటది" వివరించాడు గిరయ్య.

"డాక్టర్ - పంతులు కంపెనీలో మనుసుల కాసికెల్తాడా?" ఆశ్చర్యపోయాడు కిట్టయ్య....

ఇన్నాళ్ళనుంచి చూస్తున్నాం. పంతుల్లో అట్టాంటి బుద్దులే లేవు" అన్నాడు బుజ్జి.

"ఉన్నయ్యే అనుకో! ఈ ఊళ్ళోనే ఉండిపోవాలి కాని, పోతాననటమేంటి? పోతా పోతా, 'నిర్మల మంచిది' అనటం ఏంటి!" లా పాయింట్లు లేవదీసాడు గిరయ్య

"ఇందులో ఏదో తిరకాసుంది...." కనిపెట్టేసాడు బుజ్జి. "శాస్త్రిలుగారి నడిగితేసరి! అన్నీ తెలిపిపోతాయి." అని సొల్యూషన్ కూడా చెప్పేసాడు.

అంతకంటె వాళ్ళకు ఏ మార్గమూ తోచలేదు. శాస్త్రులుగారి దగ్గిరకే బయలుదేరారు. రోజూ బుజ్జి ఒక్కడితోనే సిగ్గిపోతున్న శాస్త్రిగారు ఒక్కసారిగా నలుగుర్నీచూపి మరింత విసిగి పోయారు.

వాళ్ళ వాళ్ళ కష్టార్జితంలో ఒక్కొక్క రూపాయి ముందుపెట్టేసరికి విసుగు కాస్తా మాయమయింది. "ఎవరి చెయ్యిచూడాలి?" అన్నాడు.

"చెయ్యి చూడక్కర్లేదు. ఒకిసయం చెప్పాలి. మా డాక్టర్-పంతులు ఎల్లిపోతానంటన్నాడు, నిర్మల మంచిదంటన్నాడు. మాకేం అర్థంకాటంలేదు...."

శాస్త్రులుగారు నవ్వి "ఏముందీ? మీ డాక్టర్-పంతులికీ, ఆ నిర్మ లమ్మకీ పెళ్ళయిపోతుంది" అన్నాడు.

నలుగురూ గతుక్కుమన్నారు. గిరయ్య ఆశ్చర్యంగా "ఆ నిర్మలమ్మ కంపెనీలో మనిషి!" అన్నాడు.

శాస్త్రులుగారు గతుక్కుమన్నారు. అయినా ఒకసారి మాట అన్నాక వెనక్కు తీసుకోవటానికిలేదు.

"అయినా సరే! పెళ్ళయిపోతుంది. నిర్మల మంచిది" అన్నాడు వాళ్ళ మాటనే తిరిగి అంటూ. ఆ మాత్రమైనా అనకపోతే ఆ పరిస్థితుల్లో తన జ్యోతిష్యానికి విలువఉండదు.

"మరి డాక్టర్-పంతులు పోతానంటన్నాడే?"

"ఆ నిర్మలే ఆయన్ని ఆపుచెయ్యగలదు. అలా ఆపు చెయ్య గలిగితేనే పెళ్ళవుతుంది!"

అప్పటికి నలుగురికీ సంతృప్తికలిగింది. ముందు కర్తవ్యాన్ని ఆలోచిస్తూ లేచారు.

నిర్మల డాక్టర్-పంతుల్ని పోకుండా ఆపుచేస్తుంది. సరే! నిర్మల దగ్గిరకు ఎవరువెళ్తారు? డాక్టర్-పంతుల్ని పోకుండా ఆపుచెయ్య మని ఎవరడుగుతారు? "నువ్వంటే నువ్వని" కాసేపు వాదులాడుకుని చివరకు నలుగురూ కలిసి వెళ్ళటానికే నిశ్చయించుకున్నారు.

"వేశ్య" లాటి పదాలు వాళ్ళకి రావు. ఆ అర్థంలో వాళ్ళువాడే పదాలు వేరు. ఆ మాటలు నిర్మల విషయంలో వాడటానికి వాళ్ళకి నోరు రాలేదు.

"నిర్మల" అనటానికీ ఎలాగో ఉంది. అంచేత వాళ్ళు ఆలోచించి, ఆలోచించి నిర్మలకి "కంపెనీ దొరసాని" అని పేరుపెట్టారు.

"కంపెనీ దొరసానమ్మా!" అంటూ వాళ్ళు నలుగురూ తన దగ్గిరకి వచ్చేసరికి నిర్మల చిరాకుపడుతూ "ఎవరు మీరు? ఏం కావాలి?" అంది.

ఆ చిరాకుచూపి వాళ్ళు కొంచెం జడిసారు. అసలు నిర్మల లాటి వాళ్ళను వాళ్ళు తప్పుకు తిరుగుతారు. తమ డాక్టర్-పంతులు కోసం కాకపోతే వాళ్ళు వచ్చేవాళ్ళేకారు.

"డాక్టర్-పంతులు పోతానంటన్నాడు?"

"పోనీ!"

"నువ్వు....మీరు....ఆపు చెయ్యాలి!"

"నేను ఎందుకు ఆపుచెయ్యాలి! నేను ఆగమంటే ఆయన ఎందుకు ఆగుతాడు?"

"నిర్మల మంచిది అన్నాడు..."

నిర్మల ఉగ్రురాలై పోయింది "ఆయనే నాతో చెప్పమన్నాడా ఈ మాటలన్నీ మిమ్మల్ని?"

ఆ కోపానికి మరొకసారి గుండెలు ఝల్లుమన్నాయి వాళ్ళకి.

"లేదు....లేదు, ఆయనకేం తెలీదు....మేమే వచ్చాం!"

"ఎందుకొచ్చారు? పోండి!"

వాళ్ళకు కళ్ళలో నీళ్ళు తిరిగిపోతున్నాయి. "కంపెనీ దొరసానమ్మా! మా డాక్టర్-పంతులు పోకుండా ఆపవమ్మా!" అన్నారు చేతులు జోడించి.

వాళ్ళ దైన్యం చూస్తోంటే నిర్మలకు జాలికలగలేదు కాని కుతూహలం కలిగింది.

"డాక్టర్ - పంతులు వెళ్ళిపోతేనేం?" అంది.

ఈ మాత్రం సానుభూతి వాళ్ళకు కొంత ప్రోత్సాహాన్నిచ్చింది. ఒకరి కొకరు అందించుకుంటూ చెప్పటం మొదలుపెట్టారు.

"డక్టర్-పంతులు మాకందరికీ అన్ని జబ్బులకీ మందు లిస్తాడు"

"తియ్యటి తియ్యటి మందులు...."

"ఎన్నో జబ్బులు తగ్గిపోయినయి"

"సూదిమందులకి తగ్గనియి కూడా...."

"మా కందరికీ అప్పులిస్తాడు."

"ఎంతడిగితే అంత...."

"వడ్డీ అడగడు...."

"అసలు కూడా మరిచిపోతాడు."

"ఇంకా చాలా న్యాయాలు చేస్తాడు."

"మాకే కాదు. అందరికీ...."

"నర్సిమ్ములు పెళ్ళానికి కడుపు పోయినపుడు దవాఖానాలో చేర్పించాడు"

"రిక్షా అద్దెలు తనే పెట్టుకున్నాడు...."

ఇంతవరకూ విన్న నిర్మల పకపక నవ్వేసింది. ఆ నవ్వువిన్న వీళ్ళకి కొండంత ధైర్యం వచ్చేసింది. ఇంకా డాక్టర్-పంతులు గొప్ప తనాన్ని చెప్పాలనే ఉంది వాళ్ళకి. కాని, నిర్మల వినేలా లేదు. "వస్తావా?....రావా?" అన్నారు. వాళ్ళకి గభాలున నువ్వనే వస్తూంది. మన్నించి మాట్లాడాలని పంతులు ఎన్నివిధాలుగా బోధించినా వాళ్ళకు ఆ అలవాటు వంటపట్టడం లేదు.

'డాక్టర్-పంతులు' పట్ల ఏదో కుతూహలం కలిగింది నిర్మలలో. ఇందులో అతని చెయ్యికూడా వుందేమోననే అనుమానం ఆవిణ్ణి వదలటం లేదు.

"వస్తాను. పదండి." అంది. నలుగురితోనూ కలిసి నిర్మల డాక్టర్-పంతులు వుంటున్న పెంకుటిల్లు దగ్గిరకి వచ్చేసరికి, పంతులు సామాను సర్దుకుని ప్రయాణ సన్నాహంలో వున్నాడు. అది చూసే సరికి నిర్మలలో సగం అనుమానం తీరిపోయింది. పంతులు నిర్మలని చూడగానే తెల్లబోతూ "మీరా?....మీరు....మీరు....వచ్చారా?" అన్నాడు తడబడుతూ.

ఆ తడబాటు చూడగానే నిర్మల అనుమానం పూర్తిగా తీరిపోయింది.

గోడవారగా వున్న మడతమంచం చూపించి "కూర్చోండి!" అన్నాడు. నిర్మల ముఖం చిట్లించింది. పంతులు మళ్ళీ తడబడుతూ

"కుర్చీలేదు. నేను నించుంటాను." అన్నాడు. నిర్మల నవ్వింది. కానీ, కూర్చోలేదు.

"మీరు వెళ్ళిపోతున్నారా?" అంది.

"అవును."

"ఎందుకూ?"

"వుండటం మాత్రం ఎందుకూ? ఈ రాత్రి పాఠశాలల్లో రెండు రకాలున్నాయి. ఒక రకం పాఠశాలల్లోకి కొద్దో గొప్పో చదువుకుని, ఏదో ఒక వుద్యోగం చేసుకుంటూ ఎలాగైనా పరీక్షలు పాసవ్వాలని వస్తారు. అలాంటి వాళ్ళు తప్పకుండా వస్తారు. మరో రకం రాత్రి పాఠశాలల్లో వయోజనులకు ప్రాథమిక విద్య నేర్పటం కోసం నడుపుతారు. ఈ ప్రాథమిక విద్యకోసం వచ్చే పెద్దవాళ్ళెవరూ వుండరు. వయసుమీరిన వాళ్ళతో "తల, వల" చదివించేసరికి తల ప్రాణం తోకకొస్తుంది."

"అందుకే వెళ్ళబోతున్నారా?"

"అవును. మీరన్నాక నిజంగానే ఈ వృత్తిలో వుండటానికి నాకు సిగ్గుగా వుంది."

"యెడ్యుకేషనల్ ఫిలిమ్స్‌ద్వారా చదువు చెప్పటానికి ప్రయత్నించకూడదూ?"

"ఏదో సామెత చెప్పినట్లుగా వుంది. 'మింగ మెతుకు లేదు కాని, మీసాలకు సంపెంగనూనె కావాలన్నట్లు'. వీళ్ళు ఫండ్సు లేవంటూ మాకు జీతాలే సరిగా యివ్వటంలేదు. ఇంక యెడ్యుకేషనల్ ఫిలిమ్స్, ప్రొజెక్టర్సు ఇవన్నీ ఎవరిస్తారు?"

"మీకు జీతాలు సరిగా యివ్వటం లేదా?"

"మూడు నెలలనుంచి జీతాలు లేవు మా అన్నయ్యలు పొలాలమీది డబ్బు పంపిస్తున్నారు కనుక గడుస్తోంది."

"అయితే మీ రొక్కరే సిగ్గుపడక్కర్లేదు. మీకంటె పైవాళ్ళు-సిగ్గుపడవలసిన వాళ్ళు చాలామంది క్యూలో ఉన్నారు"

"కావచ్చు-నేనిక్కడ ఉండి చెయ్యగలిగినదేముంది?"

"అలా నిరుత్సాహపడకండి. ఒక మంచి పని తలపెట్టినప్పుడు వెంటనే పూర్తికాదు. ఏదో ఒక ఉపాయం ఆలోచిద్దాం? వెళ్ళి

పోకండి!"

"సరే! వెళ్ళను."

ఈ సంభాషణ జరుగుతున్నంతసేపూ నలుగురూ ఒకరినొకరు కనుసైగలతో హెచ్చరించుకుంటూ, భావగర్భితంగా నవ్వుకుంటూ వింటున్నారు.

డాక్టరు - పంతులు "వెళ్ళను" అనగానే నలుగురూ మహదానందంతో "కంపెనీ దొరసానమ్మ మంచిది." అన్నారు ఏక కంఠంతో.

వాళ్ళ ఆనందం చూస్తే నిర్మలకే ముచ్చటేసింది. నవ్వుకుంటూ వెళ్ళిపోయింది. నలుగురూ తమ భవనానికి బయలుదేరారు అంతరంగిక చర్చలు ప్రారంభించటానికి....

"డాక్టర్-పంతులికీ, కంపెనీ దొరసానమ్మకీ పెళ్ళవుద్దా?"

"శాస్త్రిలుగారు చెప్పినట్లే కంపెనీ దొరసానమ్మ పంతుల్ని యెల్లకుండా ఆపిందిగా! ఆయన చెప్పినట్లు పెళ్ళి అవుద్ది...."

"కంపెనీ మనిషి...."

"అయినా మంచిది...."

"ఈల్లిద్దరికీ పెల్లయితే బాగానే ఉంటది."

ఈ అభిప్రాయంతో అందరూ ఏకీభవించారు.

శాస్త్రిలుగారి జోస్యం నిజమవుతోంది. తననీ ఎవరో చదువుకున్న-ఉద్యోగం చేసే పిల్ల ప్రేమించేస్తుంది, తప్పదు- అనుకున్నాడు బుజ్జి ఉగాలుగా.

# 6

"ఏయ్! ఏంటా చూపులు? పని కానియ్యి" అన్న మేస్త్రి అదలింపుతో ఉలికిపడి ఈ లోకంలోకి వచ్చాడు బుజ్జి. ఆ రోజు అతడు పనిచేస్తున్న ఇంట్లో ఇద్దరు అందమైన అమ్మాయిలు కిలకిల

నవ్వుతూ తిరుగుతున్నారు. వాళ్ళిద్దరినీ బెంగగా చూస్తున్నాడు బుజ్జి తన జోస్యం గుర్తు చేసుకుంటూ.

"ఇట్టా అటూ ఇటూ పక్క చూపులు మొదలెట్టావంటే నీ కెప్పుడూ పనియ్యను జాగ్రత్త! అయ్యగారు చూసారంటే సున్నం లోకి ఎముక మిగలనియ్యరు!" మరోసారి హెచ్చరించాడు మేస్త్రీ. అప్పటికి జోస్యంలో రెండవ భాగం గుర్తుకొచ్చి, అదిరిపడి పని మీదకు మనసు మళ్ళించాడు

ఎక్కడ ఏ అమ్మాయి కాస్త చదువుకున్నట్లు కనిపించినా, ఆ అమ్మాయి తనను ప్రేమిస్తుందేమోనని చూస్తాడు బుజ్జి ఆ అమ్మాయి తండ్రి తనను తన్నేస్తాడేమోనని బెంగపడుతూ .... అతనిని గమనించకుండా ఆ అమ్మాయి సాగిపోగానే తేలిగ్గా నిట్టూరుస్తాడు.

కాసులయ్య కాఫీ హోటల్ బాగా వృద్ధి పొందింది. పైన మరో అంతస్థుకూడా కట్టాడు. దగ్గిర దగ్గిర పది గదులు కట్టి లాడ్జింగ్ ఏర్పాట్లు కూడా చేసాడు. ఖరీదైన హోటళ్ళలోకంటె ఇక్కడ గదులకు అద్దె తక్కువవటంతో మధ్యతరగతివాళ్ళు బయట ఊళ్ళ నుంచి వచ్చినపుడు ఆ గదుల్లో దిగుతారు. పార్ట్నర్ ఎప్పుడూ కాసు లయ్య హోటల్‌లోనే ఉండడు.కాని తరచుగా వస్తూ పోతూ ఉంటాడు.

ఆ రోజు బుజ్జి కూలి పని ముగించుకుని తన "భవనానికి" వస్తోంటే అతని ముందు ఒకమ్మాయి వెనక్కి వెనక్కి తిరిగి చూసు కుంటూ నడుస్తోంది. బుజ్జి వెనక్కి తిరిగి చూసాడు తన వెనకాతల ఎవరైనా ఉన్నారేమోనని....ఎవరూ లేరు! ఆ అమ్మాయి తననే చూస్తోందని నిశ్చయమయిపోయింది అతనికి. కాళ్ళు గడగడ వణుకు తున్నా జ్యోతిష్యం తప్పించుకోలేక ఆ అమ్మాయిని సమీపించాడు.

"ఎక్స్యూజ్‌మి...." అన్నాడు కష్టపడి నేర్చుకున్న ఇంగ్లీ ష్‌లో....ఆ అమ్మాయి ఉలికిపడి, తెల్లబోయి, తేరుకుని "ఏమిటీ" అంది ఆశ్చర్యంగా.

ఆ అమ్మాయి తెలుగులో మాట్లాడినా, బుజ్జికి మాత్రం తెలు గులో మాట్లాడాలనిపించలేదు. తెలుగులో మాట్లాడేస్తే తను కష్టపడి నేర్చుకున్న ఇంగ్లీషంతా ఏమైపోవాలి?

"ఎక్స్క్యూజ్ మి...." అన్నాడు మళ్ళీ మరింత నొక్కి నొక్కి పలుకుతూ పెద్ద నవ్వును కూడా జోడించి.... కాస్త విదానంగా ఆలోచించేసరికి అర్థమయింది ఆ అమ్మాయికి. విరగబడి నవ్వేసింది. ఆ నవ్వు చూసేసరికి బుజ్జికి పూర్తి నమ్మకం ఏర్పడిపోయింది. ఆ అమ్మాయి తన లవ్వరేనని....

"నువ్వు సదూకున్నావా?" అన్నాడు.

"ఆ! చదువుకున్నాను."

"ఉజ్జోగం సేస్తన్నావా?"

"ఆ! చేస్తున్నాను...."

"గుడ్డో!" గట్టిగా ఈల వేసాడు బుజ్జి. ఆ అమ్మాయి బుజ్జిని వింతగా చూస్తోంది. హుషారుగా నడుస్తోన్న బుజ్జి చటుక్కున ఆగిపోయి "నీకు అయ్య ఉన్నాడా?" అన్నాడు.

ఆ అమ్మాయి కూడా ఆగిపోయింది ఒక్క క్షణం....నిట్టూర్పు కూడా విడిచింది. "లేడు!" అంది.

"అయితే పర్లేదు" హుషారుగా అన్నాడు.

"ఏమిటి పరవాలేదు?" ఆశ్చర్యంగా అడిగింది.

"ఏంటిలేదు. ఆ సంచీ నేను పట్టుకుంటా?"

ఆ అమ్మాయి ఒక్కక్షణం తటపటాయించి బుజ్జిని మరోసారి ఎగాదిగా చూసింది. బుజ్జి ఒక వెర్రి నవ్వు నవ్వాడు. ఆ నవ్వుకి ముగ్ధురాలయినట్లు ఆ అమ్మాయి తన చేతిలో సంచి బుజ్జి కిచ్చింది. అ సంచి కాస్త బరువుగానే ఉంది. కానీ, ఇలాంటి బరువులు మొయ్యటం బుజ్జి కలవాటే! ఆ అమ్మాయితో లవ్వు డైలాగులు కొట్టాలని ఉంది కాని, వెధవది ఒక్కటి కూడా గుర్తు రావటంలేదు. ఆ అమ్మాయి కూడా ఏదో ఆలోచించుకుంటూ నడుస్తోంది.

"ఏడకెళ్ళాలి?" అడిగాడు బుజ్జి.

"కాసులయ్య కాఫీ హోటల్లో రూం తీసుకుని ఉంటాను."

"హేయ్! మా బంగాళా కూడా అక్కడే!"

ఆ అమ్మాయి గతుక్కుమని ఆగిపోయి "బంగళాయా?" అంది గాభరాగా.

ఆ గాభరా చూసి పరమానందంగా "ఆఁ! బంగళాయే! పెద్ద

బంగళా-రెండంతస్తులు-పై అంతస్తుకి మెట్లు లేవు-విరిగిపోయాయి. కాసులయ్య కాఫీ హోటల్‌కి ఎదురుగానే ఉంటది...." అన్నాడు.

ఆ అమ్మాయి విరగబడి నవ్వుతూ "ఆ పాడుబడిన కొంపా?" అంది....

తమ భవనాన్ని అలా అనటం బుజ్జికి నచ్చలేదు. కానీ ఆ అమ్మాయినేమీ అనలేకపోయాడు. "సదూకున్న అమ్మాయిని లవ్ సేస్తే ఇంతే! ఏటనడానికీ నేదు" అని విసుక్కున్నాడు లోలోపల.

కాసులయ్య కాఫీ హోటలు సమీపించింది. ఆ అమ్మాయి బుజ్జి చేతిలో ఉన్న సంచి తీసుకుంది. ఆ అమ్మాయి ఏమీ అనక పోవటం చూసి బుజ్జి తనే "తాంకుయూ" అన్నాడు. ఆ అమ్మాయి నవ్వుకుని తన పర్సులోంచి ఒక పావలా తీసి బుజ్జి చేతిలో పెట్టింది.

"ఇదేంటి?" అన్నాడు బుజ్జి.

"నీకు కూలి...."

బుజ్జికి గిరగిర కళ్ళలో నీళ్ళు తిరిగాయి....

"లవ్వున్నకాడ కూలి తీసుకోను!" ఆ పావలా వదులుకోవ టానికి ఎంత కష్టంగా ఉన్నా త్యాగం చేసేస్తూ అన్నాడు బుజ్జి.

మరొక్కసారి నిర్ఘాంత పోయింది ఆ అమ్మాయి. బుజ్జి కంగారు పడుతూ "నా తప్పు నేదు. ఆ శాస్తుర్లు అట్టానే చెప్పినాడు" అన్నాడు.

నెమ్మది నెమ్మదిగా బుజ్జిని ప్రశ్నలడిగి అసలు విషయం తెలు సుకున్న ఆ అమ్మాయి నవ్వుకుంటూ వెళ్ళిపోయింది. అలా ఆ అమ్మాయి నవ్వుకుంటూ వెళ్ళిపోవటంతో బుజ్జి ప్రేమ హృదయం పురి విప్పి నాట్యమాడింది. అక్కడ నిలబడి ఆ అమ్మాయి ఏరూం లోకి వెళ్ళిందో చూసి, ఆ తరువాత తన భవనంలోకి వెళ్ళాడు. అప్పటికే గిరయ్య, కిట్టయ్య, సివ్వం వచ్చేసారు.

"ఒరేయ్! ఒరేయ్! సదూకున్న అమ్మాయి, ఉద్యోగం సేస్తున్న అమ్మాయి, నన్ను లవ్ సేసేసిందిరా!" అని చెప్పేసాడు మిత్రబృందంతో....

"ఛ! ఫో!" అన్నాడు గిరయ్య....

"ఏదీ? చూపెట్టు...."అన్నాడు సివ్వం.

"కల్లోనా?" అని నవ్వాడు కిట్టయ్య.

తన ఆప్త మిత్రులే తనని నమ్మనందుకు కోపం వచ్చింది బుజ్జికి—"నిజం! ఒట్టు, అదిగో ఆ గదిలో ఉంటాది" అని తన ప్రియురాలు ప్రవేశించిన గది చూపించాడు బుజ్జి. మిత్రులంతా ఆత్రంగా చూసారు. ఆ రూం తలుపులు వేసి ఉన్నాయి. లోపల లైట్ వెలుగుతోంది. ఏవో నీడలు తప్ప ఏమీ కనపడటం లేదు. మిగిలిన ముగ్గురూ ఒక్క నిముషం చూసి విసిగిపోయి పడుకున్నారు. కాని, బుజ్జి మాత్రం కదల్లేదు, ఆ రూంవంకే చూస్తూ అలాగే కూచున్నాడు. ఒక రాత్రి వేళ ఆ గది తలుపులు తెరుచుకున్నాయి. ఆ అమ్మాయి చేతిలో సంచి పుచ్చుకుని బయటికొచ్చింది. బుజ్జి ఒక్క కేక పెట్టి తన మిత్ర బృందాన్ని లేపాడు.

"ఒరేయ్! నా లవ్వర్ ఎక్కడికో పోతంది-నేనూ పోతన్నా!" అని అరిచి ఆ అమ్మాయి దగ్గరకి పరిగెట్టాడు. ఆ అమ్మాయి గతుక్కుమని "నువ్వెందుకొచ్చావ్?" అంది కోపంగా....ఆ కోపానికి బిక్కచచ్చిపోయి "రేత్రంతా నీ గదికేసే సూత్తా కూకున్నా! నువ్వు బయటికి రాగానే నేనూ వచ్చినా...." అన్నాడు.

ఆ అమ్మాయి పక్కనే ఎవరో మరొక మీసాల అతను ఉన్నాడు. "ఎవరితను?" అన్నాడు ఇంగ్లీష్‌లో....

"ఎవరో వెఱ్ఱిబాగుల మనిషిలా ఉన్నాడు ఎవడో జ్యోతిష్కుడు చదువుకున్న అమ్మాయి వాడిని ప్రేమిస్తుందని చెప్పాడుట! నేనే వీడిని ప్రేమించబోయే అమ్మాయినని నిన్నటినుంచి నా వెంట బడ్డాడు." పకపక నవ్వింది ఆ అమ్మాయి. ఆ మీసాలాయనా నవ్వాడు.

"నాకోమంచి ఆలోచన వచ్చింది-నువ్వు వీడిని నీతో తీసుకెళ్ళు. ఈ ప్రాంతంవాడే కనుక అన్నీ తెలిసి ఉంటాయి. నిన్ను ప్రేమిస్తున్నాడు కనుక నీకే కష్టమూ రానియ్యడు. అన్నివిధాలా మంచిది." అన్నాడు.

ఆ అమ్మాయి కొంచెం ఆలోచించి అందుకు ఒప్పుకుని "నువ్వు నాతో స్టేషన్ వరకు వచ్చి రైలెక్కించగలవా?" అంది బుజ్జితో. బుజ్జి పరమానందంగా 'ఓ' అని, అంతలో దిగాలుగా "పోతున్నావా?" అన్నాడు.

ఆ అమ్మాయి నవ్వి "మళ్ళా వస్తానుగా?" అంది.

"నీ పేరేమిటి?"

"నీ యిష్టం-ఏదో ఒక పేరుపెట్టి పిలు!"

"లవర్ అంటాను."

"అలాగే!"

ఆ మీసాలతను నవ్వుకుంటూ ఆ అమ్మాయికి చెయ్యి ఊపి వెళ్ళిపోయాడు.

బుజ్జి ఆ అమ్మాయి చేతినుంచి పుచ్చుకొని బయలుదేరాడు. ఆ అమ్మాయి వెంట నడిచింది.

బుజ్జి కేకకు నిద్రలేచిన మిత్రబృందం కళ్ళు నులుముకుంటూ దూరాన్నుంచి ఈ దృశ్యం చూసారు. గుండె బాదుకుంటూ "శాస్త్రులు గారి జోస్యం నిజమయిపోయాది! ఇక డాక్టర్ పంతులికీ, [illegible] దొరసానమ్మకీ పెళ్ళయిపోద్ది" అనుకున్నారు.

# 7

"డబ్బు ఇబ్బంది"- దీనిలాంటి సార్వకాలికమూ, సార్వజనీనమూ అయిన పదం మరొకటి లేదు.

అన్ని కాలాల్లోను, అన్ని వర్గాలవారికీ తరతమ భేదాలతో వర్తించే పదం ఇది. చంద్రమ్మా, కనకమ్మా హోరాహోరీ పోట్లాడుకుంటున్నారు. ఆ పోట్లాట చూసిన వాళ్ళెవరూ వాళ్ళు తల్లీకూతుళ్ళని చెప్పినా నమ్మలేరు.

"నా మొగుడు తాగివొస్తాడని ఆడికి తెలీకుండా బిడ్డయి వెండి పట్టా గొలుసులు నీకాడ దాచిపెడితే అమ్ముకుతింటావా?" అని తల్లిని తిట్టిపోస్తోంది చంద్రమ్మ.

"ఏమేటి? నాకు తెలీకుండా మీ అమ్మకాడ సొమ్ము దాస్తున్నావా?" అని చంద్రమ్మ జుట్టు దొరకపుచ్చుకొని రకరకాల 'ముద్దు పేర్ల'తో, పిలుస్తూ తన్నాలని చూస్తున్నాడు మొగుడు. వాడిని విడిపించుకొని తల్లి వీధమీదకి పోతూ తిట్టిపోస్తోంది చంద్రమ్మ.

"నేనేం సేసినాను? మింగినానా? సీ పిల్లకి షుడు పోసాను. ఎక్కడతేను? నాల్రోజులాగు. నియ్యి సేస్తాను." అని రాగాలు తీస్తోంది కనకమ్మ.

ఇంతటి రసవత్తరమైన సన్నివేశం సాగుతుండగా అక్కడికి కుటుంబ నియంత్రణ ప్రచారకులు వచ్చారు. కుటుంబ నియంత్రణ ఆవశ్యకతని వివరించారు. పరిమిత కుటుంబంవల్ల లాభాలు తెలియ జెప్పారు. చివరకు తమతో ఆస్పత్రికి వచ్చి కుటుంబనియంత్రణ ఆపరేషను చేయించుకోమని నిర్బంధించారు. అంతవరకు వేడుగ్గా చుట్టూ మూగి ఆ ఊసులన్నీ విన్న జనం ఆస్పత్రి, ఆపరేషన్ అనగానే బెదిరిపోయారు.

"నా మొగుడు బండపని చెయ్యాల. ఆపరేషన్ అయినాక పదిరోజులు పడుకుంటే ఇల్లెట్లా గడుస్తది? నేనూ, పిల్లలు ఏమయి పోవాల?"

"నేను చెట్లమందు తాగినాను. ఇంక కాన్పురాదు. ఆస్పత్రి మందులకంటె ఇయ్యే నయం."

"అల్లామధ్య చేతిమీద గెడ్డయి ఆస్పత్రికొస్తే ఆపరేషనన్నాడు. ఏసూది గుచ్చినాడో ఏమో! ఇల్లింత లావు వాచిపోయి చీమట్టిపోనాది! సచ్చిపోనాను. ఆస్పత్రిమాట సెప్పకు దేవుడో!"

ఇలా మొదలయ్యాయి సమాధానాలు. ప్రచారకులు వాళ్ళకు నచ్చజెప్పాలని చూస్తూనే ఉన్నారు. వాళ్ళ వాళ్ళ గొడవలు చెప్పు కుంటూనే ఉన్నారు. ఎవరిగోల వాళ్ళదిగా ఉంది.

"ఆపరేషన్ చేయించుకుంటే మీకు కొంతడబ్బు బహుమతిగా ఇస్తారు." అని ఆశ చూపించారు ప్రచారకులు.

గిరయ్య వెంటనే ముందుకొచ్చి "నేను చేయించుకుంటాను!" అన్నాడు. ఒక్క కేసైనా తగిలినందుకు పరమానందపడుతూ "అలాగే! మాతో ఆస్పత్రికి రావాలి. మీ ఆవిడ అంగీకారం కూడా కావాలి!" అన్నారు.

గిరయ్య సిగ్గుపడుతూ "నాకు పెళ్ళికాలేదు. మీరు పైసలిస్తే ఓలికట్టి పెళ్ళాడాల!" అన్నాడు. వాళ్ళు మొదట నిర్ఘాంతపోయి, తరు

వాత ఒకళ్ళ ముఖం ఒకళ్ళు చూసుకుని పకపక నవ్వుకుని "వీళ్ళకేం చెప్పగలం?" అనుకున్నారు నీరాళగా....

మిత్రబృందం నలుగురూ ఒకేసారిగా డబ్బు ఇబ్బందిలో పడ్డారు. బుజ్జిగాడు 'పవ్వు'లో పడ్డాక తనకు ప్రత్యేకంగా ఒక అద్దం కొనుక్కోవాలనుకుంటున్నాడు. డబ్బులు లేవు. సిద్ధానికి ఆ రోజే విడుదలయిన కొత్త సినిమా చూడకపోతే ప్రాణాలు నిలవటంలేదు. డబ్బులు లేవు. నాగులు దాని మోజులోపడి దానికి యెంకికడియాలు కొంటానికి మార్వాడీ దగ్గర అప్పుచేశాడు కిట్టయ్య. "వడ్డీ అయినా కట్టకపోతే బ్రతకనియ్యను" అంటున్నాడు మార్వాడీ....డాక్టరు పంతుల్ని ఎలా అడగాలో కూడా అర్థంకావటంలేదు కిట్టయ్యకి. అందరికంటె పెద్ద పద్దు గిరయ్యది. పదోక్లాసు లక్ష్మిని పెళ్ళాడటా`కి ఓలిడబ్బులు రెండొందలు కావాలి! డాక్టరు - పంతులు అయినా, పదీ సర్దుతాడు కానీ. ఒక్కసారిగా రెండొందలిస్తాడా? నలుగురూ కూడ బలుక్కుని పంతులు ఇంటికొచ్చారు. పంతులు దిగాలుగా కూచుని ఉన్నాడు. "అట్టాఉన్నావేంటి పంతులూ?" అని ఆప్యాయంగా పలకరించారు. "డబ్బు ఇబ్బంది!" బెంగగా అన్నాడు పంతులు, నలుగురూ ఒక్కసారిగా గతుక్కుమన్నారు ఖాళీజేబులు తడుముకుంటూ!

"ఎంతకావాలేంటి?" అన్నారు బింకంగా....

"మూడు వేలు? మూవీ ప్రొజెక్టరు కొనాలి!"

నిలబడ్డ నలుగురూ ధన్‌మని కూలపడ్డారు.

# 8

రాత్రి పాఠశాలకి చదువుకోవటానికెవరూ రాకపోతె తను వెళ్ళిపో తానని బెదిరించాడు డాక్టరు-పంతులు. పంతులు చెప్పే చదువు కంటె పంతులు మందులు కావాలి అందరికీ. తియ్యగా ఉంటాయి. చిన్నపిల్లలకి వచ్చే జబ్బులన్నీ తగ్గిపోతున్నాయి. ఫీజ్ అక్కర్లేదు. అంచేత చాలామంది పంతులు వెళ్ళిపోకుండా ఉండాలని చదువుకోవ

టానికి రావటం మొదలుపెట్టారు. వేంకటాచలపతికి కొంతైనా తన కర్తవ్యం నిర్వర్తించగలుగుతున్నాననే సంతృప్తి కలిగింది. సరస్వతమ్మ ఎన్నాళ్ళగానో కళ్ళనొప్పులతో బాధపడుతోంది. అప్పుడప్పుడు నడుం పట్టేస్తుంది ఆవిడకు-ఇవన్నీ లెక్కచెయ్యకుండా యాంత్రికంగా తిరగటం అలవాటు చేసుకుంది ఆవిడ. డాక్టర్-పంతులు హోమియోపతి మందులిస్తాడనీ, అవి బాగా పనిచేస్తాయనీ వింది. పోనీ, చూద్దామనిపించి పంతుల్ని పిలిపించింది. కబురందగానే సంతోషంగా వచ్చాడు పంతులు. సరస్వతమ్మకి ఏవేవో మాత్ర లిచ్చాడు. అవి కాస్త పనిచేసాయి. ఆవిడ నడుంనొప్పి కాస్త తగ్గింది. అంతకుముందు అహర్నిశలూ నొప్పిగా ఉన్నప్పుడు లక్ష్యపెట్టకుండా తిరగగలిగిన సరస్వతమ్మ అప్పుడప్పుడు నొప్పి తగ్గగానే. నొప్పి వచ్చి నప్పుడు అసలు భరించలేకపోతోంది. ఆ కారణంగా పంతులు సుధర్మకి తరచు రావలసివస్తోంది. అక్కడి ఉన్న మిగిలిన అమ్మాయి లకు కూడా ఉచితంగా తియ్యని మందులిచ్చే డాక్టర్ని చూడగానే అంతకు ముందు తమకు ఉన్నాయనికూడా తెలియని రోగాలన్నీ గుర్తుకు రాసాగాయి. దానా దీనా డాక్టర్-పంతులు సుధర్మకు సన్నిహితుడు, ఆత్మీయుడూ కూడా అయిపోయాడు. పంతులుతో పాటు అతని ప్రియ శిష్యులు నలుగురూ కూడా సుధర్మకు సన్నిహితులయిపోయారు. సుధర్మ వాతావరణమే పంతులికి విచిత్రంగా కనిపించేది. అక్కడున్న అమ్మాయిలందరూ ఎప్పుడూ ఏవో ఒక పని చేస్తూనే ఉంటారు. అల్లికలు, కుట్లు, పెయింటింగ్స్-ఇలా రకరకాలు. తను కథల్లో-నవలల్లో చదివిన దైన్యం వాళ్ళ ముఖాల్లో ఏకోశానా కనిపించటం లేదు. గుమ్మంలో ఘూర్ఖా లేదు. వాళ్ళు హాయిగా ఇష్టంవచ్చినట్లు ఎక్కడికి కావాలంటే అక్కడికి వెళ్తారు. ఏ నిర్బంధాలూ కనిపించ లేదు. అక్కడికి విటులు వస్తున్నారా? ఏమో! విటులు వస్తే రాత్రులు కదా వచ్చేది! పంతులు ఎప్పుడూ రాత్రి సమయాలలో రాలేదు. అప్పుడప్పుడు ఎవరెవరో వస్తుంటారని తన శిష్యులు చెప్పగా విన్నాడు. దానిగురించి ఆలోచించటం ఇష్టంలేక ఆ విషయం మనసు లోంచి తొలగించటానికి ప్రయత్నించేవాడు. చివరికి ఒకనాడు సరస్వ

తమ్మనే అడిగేసాడు. "మీకు కాపలాగా ఘూర్ఖా ఎవరూ లేరేం?" అని. సరస్వతమ్మ నవ్వుతూ "కాపలా దేనికి?" అంది.

"ఈ అమ్మాయిలు పారిపోరా?"

"పారిపోవల్సిన కర్మ ఏముంది? వీళ్ళు వెళ్ళాలనుకుంటే వెళ్ళిపోవచ్చును!"—ఎన్నెన్నో అడగాలనుకున్న పంతులు ఎలా అడగాలో తెలియక ఊరుకున్నాడు. అతని అవస్థ కనిపెట్టి సరస్వతమ్మ పరిచిత ఊరిస్తున్నట్లు "ఇక్కడ అమ్మాయిల్లో కొందరికి పెళ్ళిళ్ళు కూడా అయ్యాయి" అంది.

"పెళ్ళిళ్ళా?" అన్నాడు పంతులు పట్టరాని ఆశ్చర్యంతో....

ఆ ఆశ్చర్యానికి ఆనందిస్తూ "అవును. వాళ్ళందరి పేర్లూ, వాళ్ళ భర్తల పేర్లతో కలిపి నా డైరీలో రాసుకున్నాను. [illegible] మంచి సంబంధాలే!" అంది. "ఎలా? ఎలా?" అన్నాడు పంతులు తికమక పడుతూ....

"ఎలా ఏముంది? లోకంలో గొప్ప మనసు కలవాళ్ళు కూడా ఉంటారు."

పంతులు గుటకలు మ్రింగి ఊరుకున్నాడు. నిర్మల మరీ వింతగా కనిపిస్తుంది పంతులికి. [illegible] వాళ్ళ [illegible] ఆ పనులూ ఈ పనులూ చెయ్యడం, [illegible] చదువుతూ, రాసుకుంటూ ఉంటుంది లేకపోతే ఎక్కడికో వెళ్ళిపోతుంది. "ఎక్కడకు వెళ్ళావు? ఏం చదువుతున్నావు? [illegible]" ప్రశ్నలు అడగాలని పంతులికెంతో కుతూహలంగా ఉన్నా [illegible] సాహసం కలగటంలేదు. నిర్మలకి [illegible] అదేమిటో [illegible] పంతులితో [illegible] ఆ [illegible]

ఆ రోజు కానిస్టేబిల్ రాఘవయ్య [illegible] అలాగైనా [illegible] "[illegible]" [illegible] ఏదో ఒక విచిత్రమైన ఆలోచనతో

"ఏదో, మీ [illegible]." రాఘవయ్యకేసి [illegible] చూస్తూ వెటకారంగా అంది నిర్మల. ఎప్పుడూ [illegible] చూస్తున్నాడు రాఘవయ్య.

"ఇక్కడ ఇద్దరు ముగ్గురు గూండాలు మనచేతుల్లో ఉన్నారు. తలుచుకుంటే ఏమైనా చెయ్యగలరు."

"అలాగా...."

"మీకేదైనా ఇబ్బంది కలిగితే నాకు చెప్పండి. క్షణాల్లో వాళ్ళని క్కడికి పిలిపిస్తాను."

"థేంక్స్."

రాఘవయ్య కొంచెంసేపు ఏదో ఆలోస్తున్నట్లు మౌనంగా కూచున్నాడు. అతని చూపులు నిర్మలను యావగా చూస్తున్నాయి. ఎంతకూ ఎవరూ ఏదీ మాట్లాడకపోవటంతో విసిగి "నా మామూలేది?" అన్నాడు.

"ఏ మామూలు?"

"ఏయ్! చాలా దూరంపోతుంది జాగ్రత్త!"

"ఎంతదూరం పోతుంది? ఒక పోలీస్ కానిస్టేబుల్ తన చేతుల్లో గూండాలున్నారని సగర్వంగా చెప్పుకుంటున్నట్లు పై అధికారులకు తెలిసేవరకూ, కంపెనీలకు బాహాటంగా వచ్చి మామూళ్ళకోసం బెదిరిస్తున్నాడని రిపోర్ట్ వెళ్ళేవరకా?"

రాఘవయ్య ముఖం పాలిపోయింది. అతని కాళ్ళు వణకటం స్పష్టంగా కనిపించింది. చేతిలో లాఠీ గట్టిగా నేలమీదకొట్టి "చూస్తాను చూస్తాను" అనుకుంటూ వెళ్ళిపోయాడు.

పోలీసులు కంపెనీలో ఆడవాళ్ళని రకరకాల యాతనలు పెడతారని విన్నాడు. అలానే కథల్లో చదివాడు. ఇప్పుడు తన కళ్ళ ముందు కంపెనీలో మనిషే పోలీసుని అదరగొట్టి పంపించింది.

"వహ్వా! కంపెనీలంటే ఇలా ఉండాలి!" అన్నాడు పంతులు ఆనందంతో. నిర్మల అతని ముఖంలోకి చూసి నవ్వింది.

మిత్రులు నలుగురికీ సరస్వతమ్మ దగ్గిర బాగా చనువు ఏర్పడి పోయింది "అమ్మగారు!" అంటూ కూడాకూడా తిరుగుతున్నారు.

"అమ్మగారూ! డాక్టర్-పంతులకీ, కంపెనీ దొరసానమ్మకీ పెళ్ళెప్పుడు అవుద్దో!" అనేవాడు ఒక రోజున బుజ్జి-వారినలుగురిలో కొంచెం అమాయకుడు. మిగిలిన ముగ్గురూ అలా మాట్లాడవద్దని

కనుసైగలు చేసినా గమనించుకోలేదు. ఉలికిపడింది సరస్వతమ్మ. మిగిలిన అమ్మాయిలు కూడా తెల్లబోయి చూసారు....

"ఏమిటి? నిర్మలకీ, పంతులకీ పెళ్ళా?" ఆశ్చర్యంగా అడిగింది సరస్వతమ్మ

"అవును-జోస్యం తప్పదు." అని వంతపాడారు మిగిలిన ముగ్గురూ ఇంతవరకు వచ్చాక అసలు విషయం బయటపెట్టటమే మంచి దనిపించింది వాళ్ళకి. ఎవరూ పూసుకోకుండా పెళ్ళి ఎలా అవుతుంది?

"ఏం జోస్యం?"

"శాస్త్రులుగారు చెప్పారు. 'నిర్మల మంచిపె.' అని చెప్పారు."

"ఏమన్నారు?" నమ్మలేనట్లు అడిగింది సరస్వతమ్మ. కిట్టయ్య ఉత్సాహంతో మళ్ళీ వివరించాడు.

"బుజ్జి కాయన చెప్పిన జోస్యం నిజమయిపోనాది. సదువుకున్న అమ్మాయి బుజ్జిగాడిని లవ్ సేసేస్తాంది." సగం కుళ్ళూ సగం గొప్పా కలిపి అన్నాడు గిరయ్య.

"నిజమేనా?" ఆశ్చర్యంగా అడిగింది సరస్వతమ్మ.

బుజ్జి సిగ్గుపడుతూ వినయంగా తల వంచుకున్నాడు.

సరస్వతమ్మ కొంచెంసేపు ఆలోచనలోపడి "నిర్మలకీ పంతులకీ పెళ్ళయితే బాగానే ఉంటుంది." అంది. మిగిలిన అమ్మాయిలందరూ వెంటనే ఈ అభిప్రాయంతో ఏకీభవించారు. అమ్మగారు, అమ్మాయిలు కూడా ఈ అభిప్రాయానికే వచ్చినందుకు మిత్రబృందం చాలా సంతోషించింది. ఆనాటినుండీ సరస్వతమ్మ, మిగిలిన అమ్మాయిలు, మిత్రబృందం....నిర్మల, పంతులు మాట్లాడుకుంటున్నప్పుడల్లా కుతూహలంతో కనిపెట్టసాగారు. వాళ్ళు దేనికైనా నవ్వుకుంటే వీళ్ళు ఒకళ్ళని చూసి మరొకళ్ళు నవ్వుకోసాగారు.

ఆ రోజు ఉన్నట్టుండి నిర్మల "పంతులుగారూ! నేను సినిమాకెళ్తున్నాను. మీరూ వస్తారా?" అంది.

"వస్తాను-వస్తాను." అన్నాడు పంతులు వెంటనే....

పంతులుతో కలిపి నిర్మల సినిమాకు బయలుదేరగానే నలుగురు మిత్రులు, సరస్వతమ్మ, 'సుధర్మ'లో అమ్మాయిలూ నవ్వులతో, కేరింతలతో ఆ సందర్భాన్ని 'సెలెబ్రేట్' చేసుకున్నారు.

# 9

"సినిమా హాలు దగ్గిరే వుంది. నడుచుకుంటూ వెళ్దాం!" అంది నిర్మల డాక్టర్‌పంతులు హావభావాలు చదవాలని ప్రయత్నిస్తూ.

డాక్టర్-పంతులు సంతోషంతో "అలాగే!" అన్నాడు ఏ మాత్రం సంకోచించకుండా. నిర్మలతో కలిసి నడిరోడ్డుమీద పంతులు నడుచుకుంటూ వెళుతోంటే అందరూ విరగబడి చూసారు. "కంపెనీ మనిసితో పంతులు నడిబజారున పోతావుండాడు." అని బుగ్గ మీద వేసుకున్నారు కూలిజనం.

"ఛీ! ఈ పంతులుగారు కూడా ఇలాంటి వాడేనా? పోనీ, ఆ ఏడ్చు కునేదేదో చాటుమాటుగా ఏడ్చుకోకూడదూ? ఇంత బరితెగించి తిరగ టమా?" అని ముఖాలు చిట్లించుకున్నారు చదువుకున్నవాళ్ళు.

నిర్మల అందరినీ గమనిస్తోంది. పంతులు రియాక్షన్ కోసం అతని ముఖంలోకి చూసింది. పంతులుకి తన చుట్టుపక్కల ఏం జరుగుతోందో కూడా పట్టినట్లు లేదు.

తన ధోరణిలో మాట్లాడటం మొదలు పెట్టేశాడు.

"ఈ కూలి జనం సమస్యల కన్నింటికీ అసలు కారణం ఏమిటంటారు? ఇగ్నోరెన్స్! అదే మూలం అన్ని సమస్యలకీ.... వీళ్ళు ప్రతిరోజు కల్లు పాకల దగ్గరకి చేరకుండా వుంటే-చేజేతులా అంటు వ్యాధులు కొని తెచ్చుకోకుండా వుంటే....డజన్లకొద్దీ సంతానాన్ని కనకుండ వుంటే....అలా వుంటే, వీళ్ళు మన మధ్యతరగతి వాళ్ళ కంటే బాగానే బ్రతగ్గలరు. వీళ్ళలో విజ్ఞానాన్ని వ్యాపింపచెయ్యటం ఎలా? 'కేట్-పిల్లి', 'రేట్-ఎలుక' అంటూ మొదలుపెడితే ఏం వస్తుంది? ఎంత వస్తుంది? యెడ్యుకేషనల్ ఫిలిమ్స్ చూపించటం ద్వారా త్వరగా వాళ్ళకు బోధించవచ్చు. మన దగ్గిర ప్రొజెక్టర్ వుంటే ఫిలిమ్స్ అద్దెకు తెచ్చుకోవచ్చు. చాలా మంచి మంచి ఫిలిమ్స్ వున్నాయి. అంటువ్యాధులు ఎలా వ్యాపిస్తున్నాయి? కంటి జబ్బులు ఎలా నివారించు

కాని, కూలివాళ్ళ సంగతి కాని మాట్లాడారంటే ఊరుకోను." అని కసిరింది. పంతులు బిత్తరపోయి చూసి "అలాగే!" అన్నాడు.

హాల్లోకి వెళ్ళాక నిర్మల మొదటి సీట్లోకూచుంది. నిర్మలని దాటి పంతులు రెండో సీట్లోకి వెళ్ళబోతుండగా నిర్మల కాలు అడ్డు పెట్టింది. పంతులు తూలి నిర్మలమీద పడ్డాడు. "ఏమిటి?" అంది నిర్మల చిరునవ్వుతో ముఖం చిట్లించి. పాపం, పంతులు కంగారు పడిపోతూ చెమటలు పడుతుండగా "అయామ్ సారీ! చీకటి. చూసుకో లేదు." అన్నాడు. తను కాలు అడ్డుపెట్టిన సంగతి ఇతనికి తెలిసిందా? తన ముఖంలో చిరునవ్వు ఇతనికి కనిపించలేదా? ఎందుకంత కంగారు? నిర్మల పైకే నవ్వేసింది. "హమ్మయ్య" అనుకున్న పంతులు తనూ అర్థరహితంగా నవ్వి నిర్మల పక్కన కూచున్నాడు. ఒకటి రెండు సార్లు నిర్మల తన భుజాన్ని ఆతని భుజానికి తాకించింది. పంతులులో చలనమేలేదు. అతనికి స్పర్శాజ్ఞానం లేదేమోనని అనుమానం వచ్చి చెయ్యిమీద నెమ్మదిగా గిల్లింది. ఒక్కసారి ఆ చెయ్యిమీద మరో చేత్తో రాసుకుని సినిమా కథలో లీనమయిపోయాడు పంతులు! నిర్మలకు మండిపోయి లేచి విసుగ్గా "వెళ్ళిపోదాం?" అంది. సినిమాను మధ్యలో వదిలి రావటం పంతులుకెంతమాత్రం ఇష్టం లేదు. "ఎందుకూ? పాపం. ఆ హీరోయిన్ ఏమయిపోతుందో? ఆ విలన్ హీరోని ఏం చేస్తాడో!" అన్నాడు కథగురించి ఆలోచిస్తూ.

"హీరో విలన్ని చంపేస్తాడు, లేదా పోలీసులకి పట్టిస్తాడు. హీరోయిన్ని పెళ్ళి చేసుకుంటాడు" చిరాకు పడుతూ అంది నిర్మల.

"మీ కెలా తెలుసు?"

"రచయితని కాను గనుక!...."

అతను కదిలేలా లేడని చరచర హాల్లోంచి బయటకు వచ్చేసింది నిర్మల. తెరమీది బొమ్మల్ని చివరిసారి దిగాలుగా, ఆపాయంగా చూసి విధిలేక తనూ బయటి కొచ్చేసాడు.

"ఎందుకొచ్చేసారు మధ్యలో?" అన్నాడు.

"తలనొప్పి వచ్చింది."

"తలనొప్పా? ఇంటికెళ్ళగానే మందిస్తాను. నిజానికి హోమియోపతి వైద్యం చాలా మంచిది. ప్రకృతి వైద్యానికి కొంత సన్నిహిత

మయింది. ఆహార విహారాల్లో సరిఅయిన నియమం పాటిస్తే చాలా జబ్బులు...."

నిర్మలకి నిజంగా తలనొప్పి వచ్చేస్తోంది. ఈ డాక్టర్-పంతుల్తో. వచ్చేటప్పుడంతా పంతులు బోర్ కొట్టాడు. ఇప్పుడిక వెళ్ళేటప్పుడూ డాక్టర్ బోరు కొట్టేస్తాడా.... కానీ....అ వెన్నెల్లో డాక్టర్-పంతులు స్తబ్ధంగా, అమాయకంగా అందం అనటానికి వీల్లేని అందంతో ఆకర్ష ణీయంగా వున్నాడు.

"మీకీ క్షణంలో దేవుడు ప్రత్యక్షమయి ఏం కావాలని అడి గితే ఏం కోరుకుంటారు?"

"మూడు వేలు కావాలని కోరుకుంటాను." నిజంగా దేవుడు తన ముందు ప్రత్యక్షమయి "ఏం కావాలో కోరుకో"మని అడిగి తను ఆలస్యం చేస్తే మళ్ళీ మాయమయి పోతాదేమోనన్నంత ఆరా టంగా అన్నాడు.

నివ్వెరపోయింది నిర్మల.

"మూడువేలు దొరికితే ప్రొజెక్టర్ కొనేస్తాను. అప్పుడు యెడ్యుకేషనల్ ఫిలిమ్స్ చూపించి కూలి జనంలో విజ్ఞానం వ్యాప్తి చెయ్యొచ్చు." విసుగ్గా ముఖం తిప్పుకుంది నిర్మల. పంతులు కొన్ని క్షణాలు తటపటాయించి బెరుగ్గా "అప్పుడు మీకు నేనంటే మంచి అభిప్రాయం ఏర్పడుతుంది. కదూ!" అన్నాడు.

నిర్మల కళ్ళెత్తి పంతుల్ని చూసింది. ఆ కళ్ళు తళతళ మెరిశాయి.



# 10

కాసులయ్య కాఫీహోటల్ వృద్ధిపొందటానికి కారకుడయిన పార్ట్నర్ ఎప్పుడూ కాసులయ్య కాఫీహోటల్లో ఉండడు. తరచు వస్తు పోతూ ఉంటాడు. పార్ట్నర్ అనటమే తప్ప అతని పేరు కూడ ఎవరికీ తెలియదు. తను ఇటీవల కట్టించిన గదుల్లో ఒక గ

ప్రత్యేకం పార్ట్నర్‌కోసం ఏర్పాటు చేశాడు కాసులయ్య. పార్ట్నర్ ఉన్నా, లేకపోయినా ఆ గది మరొకడికి ఇయ్యడు. తన పార్ట్నర్ అంటే కాసులయ్యకి చాలా గౌరవం. "నేనే అనుకుంటే మోసం చెయ్యటంలో నన్ను మించిపోయినవాడు మా గురువు" అంటాడు భక్తిప్రపత్తులతో.

పార్ట్నర్ వచ్చి మామూలుగా తన గదిలో దిగాడు. అతని కన్ను నిర్మలమీద పడింది.

"ఎవరా అమ్మాయి?" అని అడిగాడు కాసులయ్యని.

"కంపెనీమనిషి- కొత్త క్లాస్ మనిషి" హుషారుగా చెప్పాడు కాసులయ్య. తన పార్ట్నర్‌కి ఈ మాత్రం వినోదం అందించగలగటం అతనికి చాలా గొప్పగా ఉంది.

"పట్టపగలు కూడా ఇంత ఫ్రీగా తిరుగుతోంది!" ఆశ్చర్యంగా అడిగాడు పార్ట్నర్.

"ఆ కంపెనీ మనుష్యులంతా ఇంతే. కంపెనీ మనుష్యుల్లాగే ఉంటారు. ఆ కంపెనీ పేరు కూడా సుధర్మ. చూడండి ఎంత గొప్ప పేరో!"

"ఈ కంపెనీ, దీనికొక పేరూ....ఇంత బాహాటంగా జరగటం విచిత్రంగా ఉందే!"

"ఈ రోజుల్లో ఏది బాహాటంగా జరగటంలేదండీ! అన్నీ జరుగుతున్నవే." కన్నుకొట్టి నవ్వాడు కాసులయ్య. పార్ట్నర్ కూడా నవ్వాడు హుషారుగా! అవును, ఈ ఆధునిక యుగంలో ఎన్ని వెధవ పనులైనా బాహాటంగా చెయ్యొచ్చును- లైసెన్సు, సాహసమూ ఉండాలే కాని ..."

"ఆ అమ్మాయిని పిలిపించుకుందామా?" అతి మామూలుగా అన్నాడు పార్ట్నర్. కాసులయ్య వెంటనే భయపడుతూ, "ఇక్కడా? ఇక్కడికెప్పుడూ అలాంటి వాళ్ళని రానియ్యలేదు. పోలీసుల దృష్టి పడిందంటే మన హోటల్ పని గోవిందా" అన్నాడు.

"ఎంత పిరికివాడివయ్యా!" అని నవ్వి "సరే! నేనే అక్కడకు వెళ్తానులే!" అన్నాడు.

"ఆ పనిచెయ్యండి. అన్ని విధాలా దర్జాగా ఉంటుంది.

రెండు ఫర్లాంగులు కూడా లేదు ఆ కంపెనీ" స్థిమితపడుతూ ప్రోత్స హించాడు కాసులయ్య. ఆ రాత్రి ఎనిమిది గంటల ప్రాంతంలో కొంచెం మందు కూడా సేవించి సుధర్మలో ప్రవేశించాడు పార్ట్నర్. సరస్వతమ్మ "ఎవరు మీరు? ఏం కావాలి?" అని అడిగింది. సరస్వతమ్మని ఎడంచేత్తో ఒక్క నెట్టు నెట్టి నేరుగా నిర్మల దగ్గరకు వచ్చి "నువ్వు కావాలి?" అన్నాడు పార్ట్నర్. పార్ట్నర్ సరస్వతమ్మని నెట్టినట్లే పార్ట్నర్ని నెట్టింది నిర్మల. తూలిపడబోయి సోఫా పట్టుకుని నిలదొక్కుకుని నిలబడి నిర్మలని వింతగా చూస్తూ "భలే సరసం!" అన్నాడు.

"నీలాటి సరసుల దగ్గిర నేర్చుకున్నదే!"

"పొగరుపిట్ట....తియ్యగుండచ్చు! నాకు నువ్వు కావాలి!"

"నాకు నువ్వు అక్కర్లేదు."

"ఏంటి? నువ్వు ఆ వృత్తికి పనికిరావు."

"బ్రహ్మాండంగా పనికొస్తాను."

"శభాష్! అయితే యాభై రూపాయలు తీసుకో ఒక్క రాత్రికి!"

"ఒక్క గంటలో నేను వంద రూపాయలు ఖర్చుపెట్ట గలను!"

"ఓహ్! ఓహ్! అయితే పోనీ, వంద తీసుకో! నీ కోసం ఆమాత్రం ఖర్చుపెట్టచ్చులే!"

"నాకు నువ్వు అక్కర్లేదని చెప్పాను?"

"సాని పాపవి! కావాలీ, అక్కర్లేదూ ఏమిటి?"

"కావలసినా, అక్కర్లేకపోయినా చచ్చినట్లు వచ్చేది పెళ్ళాం! సానిపాప కాదు!"

పార్ట్నర్కి మతిపోతోంది. "ఏంటే కూసావ్!" అని చెయ్యెత్తాడు. ఆ చేతిమీద ఒక్కటి కొట్టి "మొగుడి చేతిలో చావు దెబ్బలు తిని నోరు మూసుకునేదీ పెళ్ళామే! మా దగ్గిర చెయ్యి ఎత్తితే ప్రాణాలు దక్కవు" అంది నిర్మల.

"చీటికీ మాటికీ నా పెళ్ళాంతో నిన్ను పోల్చుకుంటావేంటే సిగ్గులేనిదానా!"

"ఛీ! నీ పెళ్ళాంతో పోల్చుకునే దౌర్భాగ్యం నాకెందుకు పడుతుంది? తన దురవస్థకు కుళ్ళిపోతూ, సిగ్గుతో మూలపడి ఉంటుంది నీ పెళ్ళాం! సిగ్గుపడవలసిన అవసరమేమీ లేక గర్వంగా తలెత్తుకుని తిరుగుతాం మేము!"

పార్ట్‌నర్‌లో కసి పెరుగుతోంది! "డబ్బుకు అమ్ముడుపోయే మనిషివి నా పెళ్ళాంతో పోల్చుకుంటావా? నీకింత గర్వమా?"

"మా దగ్గిర డబ్బు చెల్లించాలి! నీ పెళ్ళానికి పాపం, అది కూడా అక్కర్లేదు. ఎదురు తనే డబ్బు చెల్లించుకుని తనకు తను బానిసగా అమ్ముడుపోతుంది; సమాజానికి జడిసి ఆచారాలకు లొంగి పోయి...."

"నీ అంతు తేలుస్తాను. ఎంత కావాలో చెప్పు."

"నువ్వు చెప్పు నీకు ఎంత- కాదు, ఎన్ని కావాలో చెప్పు దెబ్బలు!"

"ఏంటే? నువ్వు...." రుద్రుడిలా లేచి నిర్మలమీదకు రాబోయాడు. అతని మెడమీద చెయ్యివేసి ఒక్క గెంటు గెంటింది నిర్మల. ఆ నెట్టడంలో ఏం ఒడుపు ఉందోకాని, వరండాలో ఉన్న పార్ట్‌నర్ వీధిలోకెళ్ళి పడ్డాడు. అప్పటివరకూ ఊపిరి బిగబట్టి చూస్తోన్న కంపెనీ అమ్మాయిలలో ఒకావిడ దభాలున తలుపులు మూసేసింది.

క్రిందనుండి లేచి దుమ్ము దులుపుకుంటోన్న పార్ట్‌నర్‌వి డాక్టర్ పంతులు కాలరు దగ్గిర గట్టిగా పట్టుకుని "ఇక్కడికి ఎందుకొచ్చావ్?" అన్నాడు. పార్ట్‌నర్ మొదట విస్తుపోయి తరువాత చిరాకు పడుతూ "వదులు. ఎవరు నువ్వు?" అన్నాడు.

"వదలను. నిన్ను చంపేస్తాను. పాతేస్తాను. నరికేస్తాను. నిజం చెప్పు. నిర్మలకోసం వచ్చావుకదూ?"

పార్ట్‌నర్ అప్పటికీ సౌమ్యంగానే వదిలించుకోవటానికి ప్రయత్నిస్తూ "అవును. ఇందులో అబద్ధం చెప్పటానికేముందీ?" అన్నాడు. డాక్టరు. పంతులు పార్ట్‌నర్ కాలరు పట్టి గుంజుతూ "వీల్లేదు నువ్వు నిర్మల దగ్గరకి పోవటానికి వీల్లేదు. నిర్మల చాలా మంచిది." అన్నాడు.

"మంచిదేలే వదులు!" అని పార్ట్నర్ ఒక్క విదిలింపుతో షర్ట్ వదిలించుకున్నాడు.

"నువ్వు నిర్మల దగ్గరకు వెళ్ళటానికి వీల్లేదు. మళ్ళీ వెళ్ళనని చెప్పు." పార్ట్నర్ దారికి అడ్డుగా నిలబడి అన్నాడు.

"అది మంచిదయితే నేనెళ్తే మాత్రం నష్టమేమిటీ? అది మంచిది కాదని నీకే తెలుసునన్న మాట! పో పోవయ్యా!" అన్నాడు పొగరుగా.... పంతులు భరించలేక పార్ట్నర్ని చాచి లెంపకాయ కొట్టాడు. పంతులు తన శక్తినంతా ఉపయోగించి కొట్టిన ఆ లెంప కాయ పార్ట్నర్ని అంతగా బాధించలేదు కాని, పార్ట్నర్కి కోపం వచ్చి కొట్టిన దెబ్బలతో డాక్టరు-పంతులు స్పృహతప్పి పడిపో యాడు. ఆ స్థితిలో వదిలి పార్ట్నర్ వెళ్ళిపోయాడు నిర్దాక్షి ణ్యంగా. మరునాడు తమ గుమ్మంముందు స్పృహలేని స్థితిలో పడి ఉన్న డాక్టరు-పంతుల్ని చూసి కంపెనీ అమ్మాయిలు హడిలిపోయి నిర్మలకి చెప్పారు. నిర్మల వచ్చిచూసి, వెంటనే పంతుల్ని ఆస్పత్రిలో చేర్పించింది అపస్మారక దశలో "నిర్మల చాలా మంచిది. నువ్వు అక్కడికి వెళ్ళడానికి వీల్లేదు" అని కలవరిస్తున్నాడు డాక్టరు-పంతులు. నిర్మలకి కళ్ళలో నీళ్ళు తిరిగాయి. నలుగురు మిత్రులద్వారా జరిగిన దేమిటో తెలుసుకుంది నిర్మల. పార్ట్నర్ని నిర్మల దగ్గరికి పంపిం చాక కాసులయ్య గొప్పగా "ఇవాళ మా పార్ట్నర్ కంపెనీ నిర్మల దగ్గిరకి వెళ్ళాడు." అని చెప్పుకున్నాడు తన కష్టమర్సుతో.... కష్టమర్సుతో ఎప్పుడూ పిచ్చాపాటీ మాట్లాడుతూనే ఉంటాడు కాసు లయ్య. అలా మాట్లాడటమే వ్యాపారానికి మంచిదంటాడు. చిన్న బల్లమీద టీ దుకాణం పెట్టుకొనే రోజులనుండి అలా కబుర్లు చెపు తూనే టీలు అమ్మేవాడు. తన కబుర్లు వింటూ వాళ్ళు లోపాలు తడమకుండా, తినీ, తాగి పోతుంటే "భలే టెక్నిక్" అని మురిసి పోయేవాడు. కాసులయ్య అలా చెప్తోంటే కిట్టయ్య విన్నాడు. వాడి గుండె పగిలిపోయింది. శాస్త్రులుగారి జోస్యం ఏమయిపోవాలి? పరుగు పరుగున భవనం చేరుకుని మిత్రుల కీ సంగతి చెప్పేసాడు. నలుగురూ మరింత పరుగుతో డాక్టరు-పంతులకి సంగతి చెప్పారు. వినీవినకుండానే డాక్టరు-పంతులు సుధర్మకు పరుగుతీసారు. డాక్టరు-

పంతులుతోపాటు నలుగురూ వెంట వెళ్ళాలనుకున్నారు. కానీ, "పెద్దోళ్ళ గొడవల మ ధ్యెకి" తాము పోకూడదని ఆగిపోయారు. ఊపిరి బిగబట్టి ఏం జరుగుతుందోనని చూడసాగారు. డాక్టరు-పంతులు సుధర్మకి వెళ్ళిన పదినిముషాల్లోనే పార్ట్నర్ వచ్చేసాడు పంతులు రాలేదు. పార్ట్నర్‌ని పంపేసి పంతులు సుధర్మలో ఉండిపోయాడని అనుకున్నారు... బ్రహ్మానందపడ్డారు. చేతికందిన దానిమీద దరువులు వాయిస్తూ పాటలు కూడా పాడుకున్నారు. తెల్లవారేసరికల్లా వార్త తెలిసింది. పంతులు ఆస్పత్రిలో ఉన్నాడని. నలుగురూ ఆస్పత్రికి పరిగెత్తారు. నిర్మలతో జరిగిన సంగతంతా చెప్పారు. రాత్రి పంతులుతో పాటు తామూ రాకపోవటం పొరపాటేనని పశ్చాత్తాపపడ్డారు. తామే పక్కన ఉండి ఉంటే పంతులు వంటిమీద పడిన దెబ్బలన్నీ పార్ట్నర్ మీద పడిఉండేవని ఊహించి ఆ ఊహలో ఆనందాన్ని కూడా అనుభవించారు మంచంలో వున్న పంతుల్ని కొంతకాలం మరిచిపోయి. "నిర్మల మంచిది. నిర్మల జోలికొస్తే చంపేస్తాను" అని కలవరిస్తున్నాడు పంతులు కనిపిస్తూ బిగించి ..

"చంపేస్తానంటున్నాడు" భయంతో అన్నాడు బుజ్జి.

"చంపవలసిందే" అన్నాడు గిరిమూర్తి.

"మర్డర్ కేస్...." భయపడ్డాడు కిరణ్మూర్తి.

శివాసనికి ఏదీ మంచిగా ఊహించటం చేతకాదు. "పంతులు ఖూనీ చేస్తే మనమూ ఆ కేసులో ఇరుక్కోవలసిందే. చూస్తూ చూస్తూ పంతులు ఒక్కడూ ఖూనీ చేస్తుంటే సాయంచెయ్యకుండా ఉండగలమా? అందరమూ మర్డర్ కేసులో ఇరుక్కోవలసిందే! అందరమూ జైల్లో కూచోవలసిందే!" అన్నాడు

"ఆఁ" అంటూ గట్టిగా హడిలిపోయారు మిగిలిన ముగ్గురూ.

"ఏయ్! ఏమిటాగోల ఆస్పత్రిలో....నోరు మూసుకుని బయటకు నడవండి." అని కసిరింది నర్సు. కాబోయే ఖూనీకోరులు నలుగురూ నోరుమూసుకుని కిక్కురుమనకుండా బయటకు నడిచారు.

రెండు రోజులయినా డాక్టరు-పంతులికి పూర్తిగా స్పృహ రాలేదు. నిర్మల రాత్రింబగళ్ళు అతణ్ణే కనిపెట్టుకుని ఉంది. నిర్మల భోజనం కూడా కంపెనీ అమ్మాయిలు ఆస్పత్రికే తీసుకొచ్చేవారు. నిర్మల

తింటుందో తినబోనని దగ్గిరుండి తినిపించేవారు. పంతులు కలవరింతలు మానలేదు.

"ఇతణ్ణి దెబ్బలు కొట్టిన వాడెవడో వచ్చి క్షమాపణ కోరుకుని 'నిర్మల మంచిది, ఆవిడ జోలికిపోను' అంటేతప్ప లాభంలేదు" అన్నాడు డాక్టర్.

నిర్మల తిన్నగా వాసుదయ్య కాఫీ హోటల్లోకి వెళ్ళి నరాసరి పార్ట్నర్ గదిలోకే వెళ్ళిపోయింది. నిర్మలని చూసి తెల్లబోయాడు పార్ట్నర్. "నీ యింటికొస్తే మెడబట్టి గెంటి తిన్నగా నా గదికే వచ్చావా? భలే సానివి" అన్నాడు.

"లే! వెంటనే బయలుదేరు!" అంది నిర్మల

"ఛ! ఇంత పట్టపగలా? రాత్రికొస్తాను" అన్నాడు సంబరంగా పార్ట్నర్. అంత పరాభవం జరిగినా పార్ట్నర్కి నిర్మలమీద మోజు పోలేదు. పరాభవం జరగబట్టే మరింత పెరిగిందేమో! సునాయాసంగా లభించిన దానిమీదకంటే ఆశించి పొందలేనిదాని మీదే మోజుపెరగటం మానవ లక్షణం.

"ఆసుపత్రికి రాత్రి రానియ్యరు. వెంటనే బయలుదేరు" ఆజ్ఞాపిస్తున్నట్లుగా అంది నిర్మల.

"నేను ఆస్పత్రికి దేనికి? నాకే రోగమూ లేదు"

"ఇప్పుడు కాదు. ఆసుపత్రికి రాకపోతే వస్తుంది. వచ్చేలా నేను చేస్తాను. బుద్ధిగా ఆస్పత్రికి వచ్చి డాక్టర్ పంతులుకి క్షమాపణ చెప్పుకో!"

"ఛీ! ఆ వెధవకి నేనెందుకు క్షమాపణ చెప్పుకోవాలి?"

"మాటలు తిన్నగా రానియ్యి! అందరూ నీలాంటివాళ్ళే అనుకోకు! ఆయనను కొట్టినందుకు క్షమాపణ చెప్పుకోవలసిందే!"

"వాడే నన్ను ముందు కొట్టాడు. కొడితే తిరిగి కొట్టక ఏంచేయను? ముద్దు పెట్టుకోనా? నిన్నయితే అలాగే చేసేవాడిని!"

"అప్పుడు ఆసుపత్రిలో నువ్వుండేవాడివి. మర్యాదగా వచ్చి క్షమాపణ చెప్పుకుంటావా? కేసు పెట్టమంటావా?"

ఉలికి పడ్డాడు పార్ట్నర్ "కేసు పెడతావా? నువ్వా?...." అని విరగబడి నవ్వి "కేసుసంగతి తెలియనివాడి ననుకోకు!" అన్నాడు.

"తెలిసినవాడివే! హెచ్చరిస్తున్నాను"

"పెట్టుకో: నా తప్పుకాదు, వాడే నన్ను కొట్టాడు."

"కొట్లాటలో తప్పు ఎవరిది కాదు కావల్సింది, ఎవరికి ఎక్కువ దెబ్బలు తగిలాయో కావాలి! దెబ్బలు తగిలి ఆసుపత్రిలో వున్నవాడు పంతులు కనుక తప్పంతా నీదే!"

"అలా అనుకున్నా నాకు బాధలేదు. పంతుల్ని నేనే కొట్టానని ఋజువేమిటి! ఆ సమయంలో అక్కడెవరూ లేరు. వున్నా సాక్ష్యం చెప్పరు. చెప్పినా- నా తప్పేమీ లేదని పలభైమందిచేత సాక్ష్యం చెప్పించగలను"

"అవును. ప్రాణం వున్న సాక్షులచేత ఎన్ని నాటకాలైనా ఆడించవచ్చు.. కాని ప్రాణంలేని సాక్షులు మాత్రం నిజమే చెపుతాయి"

"ప్రాణంలేని సాక్షులా? ఏమిటవి?"

"పంతులు చేతుల్లో ఇరుక్కుపోయిన చిరిగిపోయిన నీ షర్టు ముక్క."

పార్ట్నరు ముఖం పాలిపోయింది.

"ఆసుపత్రికి వస్తున్నావా లేదా?"

అప్పటికీ పార్ట్నరు లొంగదలుచుకోలేదు.

"నువ్వు నా మీద కేసుపెడతావా?" అన్నాడు వెటకారంగా.

"నేను పెట్టక్కరలేదు. డాక్టరు పంతులంటే ప్రాణం పెట్టే వాళ్ళు ఇక్కడ చాలామంది వున్నారు. పోలీస్ కేసు ఎవరయినా పెట్టవచ్చును. ఒకటి కాదు, అన్ని సంగతులూ బయటపడతాయి"

పార్ట్నరు బింకం పూర్తిగా సడలిపోయింది. రాజీ బేరానికి వస్తూ "ఆ డాక్టరు పంతులుకి ఎంతో కొంత పరిహారం పడేస్తాను" అన్నాడు.

"నీ ముష్టి ఎవడికీ అవసరంలేదు. వచ్చి క్షమాపణ చెప్పుకో వలసిందే! అదీగాక డాక్టరు నువ్వు క్షమాపణ చెప్పుకుంటేకాని పంతులుకి తగ్గదంటున్నారు. పంతులు పరిస్థితి విషమించిందంటే నీ పరిస్థితీ విషమిస్తుంది"

పార్ట్నరుకి తన ఆత్మ గౌరవం కాపాడుకోవటానికి ఒక చిన్న ఆధారం దొరికింది.

"ఒక మనిషి అపాయంలో వుంటే చూస్తూ చూస్తూ ఎలా ఊరుకోను? వస్తాను పద" అన్నాడు.

మంచంలో పడుకొని మూలుగుతోన్న డాక్టరు-పంతుల్ని చూడ గానే ఆపాదమస్తకమూ మండిపోయింది పార్ట్నరుకి. లోపల వచ్చి నూరుకొని "పంతులూ! నన్ను క్షమించు" అన్నాడు. పార్ట్నరు గొంతు వినగానే దిగ్గున లేచి కూర్చున్నాడు పంతులు. పిడికిలి బిగించి "నిర్మల మంచిది. నిర్మల జోలికొస్తే చంపేస్తాను" అన్నాడు.

"ఏయ్" అన్నాడు పార్ట్నరు.

"ఏయ్" అంది నిర్మల.

కోపంతో వణికిపోతున్న శరీరాన్ని అతికష్టంమీద అదుపులో పెట్టుకొని "నిర్మల మంచిది. నేను నిర్మల జోలికిరాను. నన్ను క్షమించు" అన్నాడు. పంతులు కోపోద్రేకం కొంచెం తగ్గింది. "నా ఎదుట నుంచి పో!" అన్నాడు పార్ట్నరుని చీదరించుకుంటూ. పంతులు పీక పిసికెయ్యాలనే కసిని ఎలాగో దిగమ్రింగుతూ అక్కడినుంచి బయట పడ్డాడు పార్ట్నరు. నిర్మల నవ్వుకుంటూ "ఎందుకింత సాహసం చేసారు? చాలా బలమైన దెబ్బలు తగిలాయి." అంది.

"నా ప్రాణం పోయినాసరే! నిన్ను మంచిది కాదన్న వాళ్ళని బ్రతకనివ్వను" ఖచ్చితంగా అన్నాడు పంతులు. పంతులు ముఖంలోకి చూస్తూ నవ్వింది నిర్మల. ఆ నవ్వు చూస్తూ తన దెబ్బలన్నీ మరిచి పోయాడు పంతులు.

# 11

గిరయ్య పని ముగించుకుని తన భవనానికి పోతున్నాడు. అతడు ఒంటరిగా ఎప్పుడు దొరుకుతాడా అని కాచుక్కూచున్న లక్ష్మి "ఓయ్! గిరయ్యా!" అని కేకేసింది. హడలిపోయాడు గిరయ్య. అత నికి లక్ష్మి అంటే ప్రాణమేకాని, ఇటీవల అది పిలిచింది అంటే భయం

పట్టుకుంది. పెళ్ళిమాట ఎత్తుతుందని. ఓలి డబ్బులు లేవు తన దగ్గర లక్ష్మి పిలిస్తే రానవగలిగే శ _ లేదు గిరియ్యకి. ముఖం నిండా నవ్వు పులుముకుని దాని దగ్గరకు వెళ్ళాడు. "ఏంటి గిరయ్యా! కంటికే కన పడటంలేదూ....?"అంది లక్ష్మి గారాలుపోతూ.ఆ గారాలు చూస్తోంటే వాడి ప్రాణాలు పోతున్నాయి.

"ఓలి డబ్బులు పోగేస్తున్నా" అన్నాడు హుషారు తెచ్చు కుంటూ-"ఆహా! ఎంత పోగేసావేంటి?" అంది లక్ష్మి కుతూహలంగా.

"అయిదు రూపాయలు దాచినా! ఇంకొక్క నూట తొంభై అయిదు జమసేస్తే"-పకాలున నవ్వింది లక్ష్మి. "ఈ లెక్కన మన పెళ్ళయినట్లే! ఇది కాదు మార్గం" అంది.

గిరయ్య కుతూహలంగా ముందుకు వంగి "మరి, మార్గమేదో నువ్వే చెప్పు." అన్నాడు.

"మనిద్దరం లేచిపోదాం!" ఆశగా అంది లక్ష్మి.

అదిరిపడ్డాడు గిరయ్య. లేచిపోవటమే! ఆ మాత్రం రైలు ఖర్చులూ, దారి ఖర్చులూ ఉంటే ఓలి ఇచ్చి పెళ్ళే చేసుకునేవాడుగా! ఉన్న పాటున ఉద్యోగం వదిలిపోతే. మరో ఊళ్ళో ఇంత 'మంచి ఉద్యోగం' దొరకద్దూ? ఇవన్నీ ఆలోచించుకుని "లేచిపోటం అంత మంచిది కాదే లక్ష్మి!" అన్నాడు శ్రీరంగనీతుల్లోకి దిగుతూ.

లక్ష్మికి మండిపోయింది. వీడు ఇలాంటిదేదో అంటాడని దానికి అనుమానంగానే ఉంది "నువ్వు రాకపోతే, నేను మరోడితో లేచిపోతాను" అనేసింది- తనను లేవదీసుకుపోవటానికి ఎవడూ సిద్ధంగా లేడని తెలిసినా. ఈ అస్త్రంతో హడిలిపోయాడు గిరయ్య. "వద్దే లక్ష్మి! నేనే నిన్ను లేపుకుపోతాను." అని బ్రతిమాలాడు. "ఎప్పుడు?" అని అడిగింది లక్ష్మి వెంటనే. ఆపద ఇలా క్షణాల మీద ముంచుకొస్తుందని ఊహించలేదు గిరయ్య. "రెండు మూడు వారాల్లో...." అన్నాడు నసుగుతూ. "కాదు, రెండు మూడు రోజుల్లో...." అంది లక్ష్మి. "అలాగే" అనేసాడు గిరయ్య రెండు మూడు వారాల్లో వచ్చే డబ్బు రోజుల్లో రాకపోతుందా అనే ధైర్యంతో....తన భవనానికి వచ్చినా నిద్రపట్టలేదు గిరయ్యకు. "డబ్బు ఎలా సంపాదించాలా?" అనే ఆలోచన రావటంకిన్న

ఘోరమైన జబ్బు ఇంకొకటి లేదు. ఆ జబ్బు వచ్చిందా ఇంక ఆ మనిషికి నిద్రాహారాలుండవు. మోహినీ పిశాచంలాగ ఆ మాయ దారి డబ్బు అందీ అందకుండా ఊరిస్తూ, మనిషి మనసుని ఎన్ని శ్మశానాలయినా తిప్పుతుంది. తెల్లవారి డాక్టర్—పంతులు ఇంటి కొచ్చాడు. పంతులుతో కాస్సేపు మాట్లాడినా మనసుకెంతో హాయిగా ఉంటుంది, తన సమస్యకు పంతులు ఏదైనా ఉపాయం చెబుతాడేమో చూడాలి! గిరయ్య వెళ్ళేసరికి పంతులు స్నానం చేస్తున్నాడు. ఎదురుగా బల్లమీద పంతులు రిస్ట్ వాచ్ వుంది. అది పట్టుకుపోయి అమ్మేసుకుంటె సుఖంగా లక్ష్మితో లేచిపోవచ్చు. మిగిలిన డబ్బు మళ్ళీ ఉద్యోగం దొరికే వరకూ సరిపెట్టుకోవచ్చు. ఛీ? ఛీ! ఇదేంటి ఇలాటి పాడు ఆలోచనలు వస్తున్నాయి తనకి? డాక్టర్-పంతులు వాచ్‌ని దొంగిలించటమా? తనని తను చీదరించుకున్నాడు గిరయ్య. అయినా అతని చూపులు ఆ వాచ్‌ని వదలటం లేదు. అతని మనసు ఆ ఆలోచనలు వదలటం లేదు. వాచ్ చేత్తో అందుకున్నాడు. వణుకు తోన్న కాళ్ళతో గుమ్మం వరకు వచ్చాడు. వెనక్కి వెళ్ళి మళ్ళీ దాన్ని బల్లమీద పెట్టేసాడు. అలా ఉండలేకపోయాడు. మళ్ళీ వాచ్‌ని తీసుకుని జేబులో పెట్టుకుని పంతులు ఫోటో ముందు నిలబడి లెంప లేసుకుని దణ్ణం పెట్టుకుని జేబు గట్టిగా పట్టుకుని పరుగెట్టాడు. ఆ ప్రాంతాల్లో నిలవలేక అప్పటికప్పుడే ఏదో చేసే లక్ష్మిని కూడా తీసుకుని స్టేషన్‌కి బయలుదేరాడు. పంతులు స్నానం చేసి వచ్చి తన వాచ్ కోసం చూసుకున్నాడు. వాచ్ కనబడలేదు. కంగారుపడి వెంటనే అన్ని వివరాలతో పోలీస్ రిపోర్ట్ ఇచ్చాడు. గిరయ్య పదో క్లాస్ లక్ష్మితో స్టేషన్‌కి చేరుకున్నాడే కాని, ఆ సమయంలో రైలేదీ లేదు. ఈ లోగా వాచ్ అమ్మేద్దామని బయలుదేరిన గిరయ్యను అతి తేలిగ్గా పట్టుకున్నారు పోలీసులు. గిరయ్యతో పాటు లక్ష్మిని కూడా పట్టుకున్నారు. పోలీస్ స్టేషన్‌లో గిరయ్యను చూసి నిర్ఘాంతపోయాడు పంతులు,

"నేనేం చెయ్యను పంతులూ! నేను లేవదీసుకు పోకపోతే మరోడితో లేచిపోతానంది పదో క్లాసు లక్ష్మి—" అని బావురు మన్నాడు గిరయ్య. పదో క్లాసు లక్ష్మి గుర్రుమంటూ చూసింది.

దానికీ కళ్ళల్లో నీళ్ళు తిరిగి పోతున్నాయి. అందరికంటె ఎంతో గొప్పగా బతకాలనుకుంది. చివరికి...."ఆ వాచ్ గిరయ్యకి నేనే బహూమానంగా ఇచ్చాను. ఆ సంగతి మరిచిపోయి రిపోర్ట్ ఇచ్చాను." అని చెప్పాడు పంతులు. కేస్ రక్తికట్టకుండా ఇలా తేలిపోయి నందుకు చిరాకు కలిగినా చేసేదేం లేక పంతుల్ని నాలుగు చీవాట్లు పెట్టి, లక్ష్మినీ, గిరయ్యనీ వదిలేసారు. గిరయ్య పంతులు కాళ్ళ మీద పడి బావురుమని ఏడ్చాడు. "లే! లే! ఏడవకు!" అని వాడిని ఓదార్చడానికి చాలా ప్రయాసపడవలసి వచ్చింది పంతులు. పదో క్లాసు లక్ష్మిని తండ్రి చావ బాదేసాడు. "గడప కదిలావంటే కాళ్ళు విరగ్గొడతా!" అంది తల్లి. పంతులు నిర్మలతో ఈ సంగతులన్నీ చెప్పి "కట్నం తీసుకోవటం నేరమంటున్నారు. కొందరిని అరెస్టు కూడా చేసారని పత్రికలలో చదివాను. కానీ ఈ ఓలి సంగతేమిటి? లక్ష్మి గిరయ్యల గతి ఏం కావాలి? లక్ష్మి తండ్రిమీద రిపోర్ట్ చెయ్యగలమా? నాకు లా ఏం తెలియదు" అన్నాడు చిరాగ్గా.

నిర్మల పంతుల్ని చూసి నవ్వి "వాళ్ళ కోసం మీకెందుకు బాధ?" అంది.

"పాపం వాళ్ళిద్దరు ప్రేమించుకున్నారు!" అన్నాడు పంతులు 'ఇంకా అర్థం కాలేదా' అన్నట్లు.

"లా ప్రకారం లక్ష్మి తండ్రి మీద చర్య తీసుకోగలమో, లేదో. నాకు తెలియదు కాని, మనం లక్ష్మికీ గిరయ్యకీ గుళ్ళో పెళ్ళి చేసేస్తే ఎవ్వరూ ఏమీ చెయ్యలేరు. లక్ష్మికి మైనారిటీ తీరిపోయింది". అంది. పంతులు పరమానందంతో ఒప్పుకున్నాడు. మిత్రబృందం ముగ్గురు అండగా నిలిచారు. నిర్మల లక్ష్మి ఇంటికి వెళ్ళి "ఇవాళ మా గదులన్నీ కడిగించి శుభ్రం చేయిస్తున్నాం. లక్ష్మిని పంపిస్తే పని చేయించుకుని డబ్బులిస్తాను" అంది.

లక్ష్మిని పనిచేయించటానికి కంపెనీకి పంపటం లక్ష్మి తల్లి కంత ఇష్టంలేదు. కానీ, అవసరాలు....! ఏ రోజుకా రోజే రెండో, మూడో రూపాయలు అప్పులేకుండా గడవదు ఆ కుటుంబానికి. అడగ్గానే అప్పుడప్పుడు చిరాకుపడ్డా అప్పులిచ్చేది ఆ ప్రాంతంలో నిర్మల మాత్రమే! అప్పుడప్పుడు ఇలా పని చేయించుకుని మిగిలిన వాళ్ళ

కంటె ఎక్కువగా డబ్బులిచ్చేది కూడా నిర్మలే! లక్ష్మి తల్లి సందే హించింది కాని ఇంట్లో డబ్బులు లేవు. రెండు రూపాయలైనా వస్తే....అయినా తటతటాయిస్తూ "ఆ గిరయ్యగాడిని నమ్మడానికి లేదమ్మా! వయసొచ్చిన పిల్ల. మొన్ననే అంత గోలయింది. ఎదకీ పంపను." అనేసింది.

లక్ష్మి తల్లి బలహీనత నిర్మలకి తెలుసు. పర్స్‌లోంచి అయిదు రూపాయల నోటు తీసి చూపిస్తూ "ఎంత? ...ఒక గంట పని! సమయానికి మనిషి దొరకలేదు లక్ష్మి వెంటనే వచ్చేస్తుంది. అయిదు రూపాయలిస్తాను." అంటే....ఆ నోటు మీద ఆశ వదులుకోలేక పోయింది లక్ష్మి తల్లి....అదీకాక నిర్మలలాంటి వ్యక్తి....లక్ష్మి తల్లి దృష్టిలో ఒక కంపెనీ మనిషి పూనుకొని. తన కూతురికీ గిరయ్యకీ పెళ్ళి చేయిస్తుందని ఎలా ఊహించగలదు?

"అల్లయ్యకి తెలిస్తే చంపేస్తాడు. తొరగా పంపండి!"అంది.

"అలాగే!" అని ఒప్పుకుంది నిర్మల. లక్ష్మి మాత్రం తాను పోనని మొరాయించింది. జరిగిన గొడవ అందరికీ తెలిసిపోయింది. దానికి బయటికి కదలాలంటే చాలా సిగ్గుగా ఉంది. తల్లి నాలుగు బాదింది. లక్ష్మి ఏడ్చి కళ్ళు తుడుచుకుని, ఆ తరువాత తల దువ్వు కుని, పాత నైలాన్ చీర కట్టుకుని మరీ బయటకు వచ్చింది. ఎంత ఏడుపుతో ఉన్నా తను పదో క్లాసు లక్ష్మిననే విషయం అది మరచిపోదు. నిర్మల లక్ష్మిని తిన్నగా గుడికే తీసికెళ్ళింది. అప్పటికే అక్కడ అందరూ ఉన్నారు. లక్ష్మి తెల్లబోయింది. "లక్ష్మీ! మే మంతా నీకూ గిరయ్యకీ పెళ్ళిచెయ్యాలను కుంటున్నాం. నీకిష్టమేనా?" అని అడిగింది నిర్మల. సంతోషంగా తల ఊపింది లక్ష్మి. నిర్మల తన కోసం కొన్న పెళ్ళి చీర చూసాక దాని సంతోషం మరింత ఎక్కువయింది. బలి తీసుకున్నా అయ్య తన కంత మంచి చీర కొన మన్నా కొనడు. పురోహితుడు కూడా సిద్ధంగా ఉన్నాడు. "ఓయ్ బ్రాహ్మడూ! గబగబ ముఖ్యమైన మంత్రాలు చదివెయ్యి. పెళ్ళి త్వరగా అయిపోవాలి! శోభనం మంత్రాలు చదివెయ్యి చాలు!" అన్నాడు కిష్టయ్య...."ముఖ్యమయినవి శోభనం మంత్రాలు కావయ్యా! సూత్ర ధారణ మంత్రాలు" అని నెత్తి కొట్టుకున్నాడు బ్రాహ్మడు. మొత్తం

మీద నవ్వులతో, కేరింతలతో పెళ్ళయి పోయింది. లక్ష్మి గిరయ్యతో కలిసి ఇంటి కొచ్చింది విభ్రాంతిపోయారు తలిదండ్రులు. నిర్మల మీద విరుచుకుపడ్డారు. నిర్మల శాంతంగా నచ్చజెప్పింది. "వయసొచ్చిన పిల్లను ఓలికోసం ఆశపడి ఎన్నాళ్ళు పెళ్ళి చెయ్యకుండా ఉంటారు? ఇప్పుడు గిరయ్యతో లేచిపోయినట్లే, మరొకడితో లేచిపోతే, నీ పిల్ల బ్రతుకేమయి పోతుందీ?" అంది. తలిదండ్రులు ఎలాగో సమాధాన పడ్డారు. తండ్రి మాత్రం "నా ఓలి రెండొందలూ నువ్వు ఇచ్చి తీరాలి!" అని గిరయ్యను బెదిరించాడు. గిరయ్య "తప్పకుండా ఇస్తాను" అని వెంటనే ఒప్పుకున్నాడు. అప్పేగా!! ఎంతయితేనేం?

# 12

బుజ్జి, కిట్టయ్య, సిద్ధాం—ముగ్గురూ భరింపరాని అసహనంలో ఉడికిపోతున్నారు. గిరయ్య పెళ్ళి కాగానే లక్ష్మితో కలిసి భవనం వదిలి వేరే ఒక్క గది వాటాలోకి మారినందుకు కాదు. ఇలాటివి సహజమేనని సరిపెట్టుకో గలరు వాళ్ళు. అంతకంటె పరమ దారుణమైన విషయం- వాళ్ళని పుండు సలిపినట్లు సలుపుతున్నది. డాక్టర్-పంతులు వాచ్ తిరిగి ఇచ్చెయ్యకుండా తన చేతికే గిరయ్య ఉంచుకోవటం.... వాళ్ళ నలుగురూ ప్రాణమిత్రులే! అందుకు సందేహంలేదు. కష్టాల్లో ఒకరి నొకరు ఆదుకుంటారు. అందుకూ సందేహం లేదు. అయితే మాత్రం? తమలో ఒకడు తేరగా బంగారంలాటి వాచ్‌ని కొట్టేస్తే భరించటం ఎలా? ఇలాటి అన్యాయం అడ్డుకోవటానికి ఎన్ని న్యాయాలైనా గుర్తుకొస్తాయి. అందుకే ముగ్గురూ చేరి "గిరయ్యా! డాక్టర్-పంతులు వాచ్ ఆయన కిచ్చెయ్యి-వాచ్ ఆయనకే అవసరం" అని పోరు మొదలు పెట్టారు. ఆ వాచ్ కొన్నాళ్ళు చేతికి పెట్టుకున్నాక దానిని తియ్యటం గిరయ్యకి కష్టంగా ఉంది. అంతటి మమతా హృదయం అతనిది. అయినా చేసేదిలేక మిత్రులతో డాక్టర్-పంతులు దగ్గరకొచ్చి కన్నబిడ్డను వదులుకుంటున్నలాటి వ్యాకులత్వంతో

"పంతులూ! నీ వాచ్ నువ్వు తీసుకో!" అన్నాడు. అప్పటికీ చేతి నుంచి తియ్యకుండానే....పంతులు ఆ వాచ్ వైపు ఒకసారి బెంగగా చూసి "ఆ వాచ్ మా నాన్నగారు నాకు బి.ఎ. పాసయినప్పుడు ప్రజంట్ చేశారు. ఆయన గుర్తుగా, చాలా అపురూపంగా దాచుకున్నాను. అయినా అందరి ముందూ నేనే ఆ వాచ్ నీ కిచ్చానని చెప్పాక, ఇప్పుడు మళ్ళీ ఎలా తీసుకోను?" అని మొహమాటపడ్డాడు పంతులు నైతిక సూత్రాలు బొత్తిగా తీసిపారెయ్యలేక-ఇది అదనుగా తీసుకుని ఆ వాచ్ గట్టిగా చేత్తో పట్టుకుని అక్కడ క్షణం కూడా నిలవకుండా పరుగుతీశాడు గిరయ్య. మిత్రులు ముగ్గురికీ ఏంచెయ్యాలో పాలుపోలేదు. ఇలాంటి అన్యాయం జరగకూడదని మాత్రం వాళ్ళ అంతరాత్మ గట్టిగా ఘోషించింది. ముగ్గురూ పోయి నిర్మలను ఆశ్రయించారు.

"పంతులికి ఆ వాచ్ వాళ్ళ నాన్న ఇచ్చారంట. "ఒకసారి అందరి ముందూ నీ కిచ్చేసానని అన్నా కదా, ఎలా తీసుకోను?" అంటున్నాడు పంతులు. ఈ గిరయ్యగాడేమో, ఆ వాచ్ చేతికి పెట్టుకుని తియ్యటం లేదు ఎట్టాగయినా పంతులు వాచ్ పంతులు కిప్పించెయ్య కంపెనీ దొరసానమ్మా!" అన్నారు. పాపం, పంతులు వాచ్ గిరయ్య ఉంచేసుకోవటం నిర్మలకీ నచ్చలేదు. పంతులు తనంతట తను అడగడనీ, అడగలేడనీ, గిరయ్య తనంత తను ఇయ్యడనీ. ఇయ్యలేడనీ నిర్మలకి బాగా తెలుసు. ఆలోచనలో పడింది. చక్కని ఉపాయం తట్టింది...."ఈ వాచ్‌ని బహుమానంగా ప్రకటించి మనం రాత్రి పాఠశాల సహాయార్థం లాటరీ టికెట్లు అమ్ముదాం, ఆ రకంగా వచ్చిన డబ్బు పెట్టి రాత్రి పాఠశాలకి మూవీ ప్రొజెక్టర్ కొనచ్చును. ఎలాగో ఒకలాగ ఆ బహుమానం పంతులుకే వచ్చేలా చూద్దాం! పంతులు వాచ్ పంతులుకి ఉండిపోతుంది."

ఈ ఆలోచన అందరికీ ఎంతో నచ్చింది. గిరయ్య మాత్రం బిక్క మొహం వేసాడు. ఈలోగా వాచ్ పాడయిపోకుండా నిర్మల దాన్ని తన దగ్గిరే ఉంచుకుంది. నలుగురు మిత్రులూ, కంపెనీలో అమ్మాయిలు, నిర్మల అందరూ టిక్కెట్స్ అమ్మారు.

"ఈ టిక్కెట్స్ అమ్ముతున్నది రాత్రి పాఠశాల సహాయార్థం.

ఈ రోజున ప్రయోజన విద్యా వ్యాప్తికి సహకరించటం ప్రతి పౌరుడి కనీస కర్తవ్యం. మీ అదృష్టం బాగుంటే బహుమతి కూడా రావచ్చు. లేకపోయినా ఒక మంచి పనికి సహకరించినవారవుతారు." ఇలాటి చక్కని మాటలతో నిర్మల చాలామందికి టిక్కెట్స్ అంటగట్టింది. డాక్టర్-పంతులుకే బహుమతి వచ్చేలాగ చూడటం ఎలా అనే విషయంపై అనేక రకాల తర్జన భర్జనలు జరిగాయి. చివరకు ఆ ఉపాయం కూడా నిర్మలే చెప్పింది. రకరకాల రంగురంగుల బిళ్ళలపై టికెట్ల నంబర్లు రాసి ఒక డబ్బాలో పొయ్యాలి. డాక్టర్-పంతులు పేరు మీద ఉన్న టికెట్ నంబరు నీలం రంగు బిళ్ళపై రాయాలి. ఇలాటి నీలం రంగు బిళ్ళలు మరేవీ డబ్బాలో ఉండకూడదు. లక్కీ బిళ్ళ తీసే వ్యక్తి జాగ్రత్తగా డబ్బా కుదిపి నీలం రంగు బిళ్ళనే తియ్యాలి. అందరికీ ఈ ఉపాయం నచ్చింది. కిట్టయ్య తన తెలివి కూడా జోడించాడు. ఆ నీలం రంగు బిళ్ళ మొదటినుంచీ డబ్బాలో ఉంచే కన్న వేరుగా ఉంచి, చివరి క్షణంలో డబ్బాలో వేస్తే చక్కగా పైనే కనిపిస్తూ ఉంటుంది. కిట్టయ్య ఆలోచనకు ఒప్పుకుంది నిర్మల. లక్కీ నంబరు డ్రా చేసే రోజు పెద్ద మీటింగ్ ఏర్పాటు చేసింది నిర్మల. అదృష్టం అంటే అందరికీ ఆశే. టిక్కెట్స్ కొన్నవాళ్ళం దరూ వచ్చారు. కొనని వాళ్ళు కూడా వచ్చారు తమాషా చూడటానికి-కొత్తగా డాన్స్ నేర్చుకుని తమ డాన్స్ ఎవరికి చూపిద్దామా అని తహతహలాడుతున్న చిన్నపిల్లలిద్దరిచేత నృత్య ప్రదర్శనలు ఏర్పాటు చేయించింది. నీలం రంగు బిళ్ళ జాగ్రత్తగా పట్టుకుని డాన్స్‌లు పూర్తి కాగానే డబ్బాలో పడెయ్యమంది కిట్టయ్యని. ఆ వెంటనే డ్రా....

చిన్నపిల్లలిద్దరూ రకరకాల డాన్స్‌లు అద్భుతంగా చేసారు. అవి చూస్తూ కిట్టయ్య తన్మయత్వంతో నీలం రంగు బిళ్ళ కింద జారవిడిచి దాని సంగతే మరిచిపోయాడు. డాన్స్‌లు పూర్తయి అందరి ముందు నిర్మల డబ్బాలోంచి లక్కీ నంబరు తియ్యబోయింది. నీలం రంగు బిళ్ళ పైన కనబడలేదు. డబ్బా రెండుమూడు సార్లు కుదిపింది. నీలం రంగు బిళ్ళ లేదు. ఉంటేగా....కనపడటానికి? నిర్మల ఎంతకూ లక్కీ నంబర్ తియ్యకపోయేసరికి జనం గొడవ

చెయ్యసాగారు. నిర్మలకు చెమటలు పట్టాయి. నంబరు తియ్యకుండానే డబ్బా కింద పెట్టేసి "మహాజనులారా! ఈ లక్కీ నంబరు నేను తియ్యను. ప్రఖ్యాత సినిమా తార చేత తీయిస్తాను. నేను ఊరికే నంబర్లు కలుపుతున్నాను" అంది. సినిమా తార అనేసరికి జనంలో కుతూహలం మిన్నుముట్టింది. తాము తెరమీద చూసిన ఆ తారను ప్రత్యక్షంగా చూడబోతున్నారు. నిర్మల చకచక వేదిక దిగివచ్చి కిట్టయ్యను పట్టుకుంది. కిట్టయ్య వణుకుతూ జరిగింది చెప్పేడు. వాడిని నాలుగు తిట్టి సుధర్మకి వచ్చింది. ఒక అమ్మాయిని డాక్టర్ టికెట్ నంబర్‌తో మరొక నీలం రంగు బిళ్ళ తయారు చెయ్యమంది. మరొక అమ్మాయిని- కాస్త అందంగా ఉన్న దాన్ని చూసి. పల్చని చిన్న జార్జెట్ చీర కట్టింది. జుట్టు విరబోసి స్టైల్‌గా ఫిక్స్ చేసింది. లిప్‌స్టిక్ వగైరాలన్నీ పులిమింది. స్టయిల్‌గా పూర్తిగా మణికట్టువరకూ చేతులున్న జాకెట్టు తొడిగి ఆ చివర సన్నగా మడిచి. ఆ మడతలో నీలం రంగు బిళ్ళ దాచింది. ఆ అమ్మాయిని తీసుకుని టాక్సీలో బయలుదేరింది. ఈలోగా అక్కడ "సినిమా తార షూటింగ్‌లో ఉంది కనుక రావటానికి కొంచెం ఆలశ్యమవుతుంది. ఈలోగా మీరు మరొక నాట్యం చూస్తారు" అని మరొక డాన్సు చేయించింది చిన్న పిల్లల చేత సరస్వతమ్మ. సినిమా డాన్సులు జనం ఎంతసేపైనా చూడగలరు గోలచేసుకుంటూ. నిర్మల "సినిమా తార"ని వేదిక మీదకి తీసుకొచ్చింది. జనం కొంచెం నిరుత్సాహపడ్డారు వాణిశ్రీ. చంద్రకళ. మంజుల వగైరాలు కానందుకు. "ఎవరు! ఎవరు!" అని గోల మొదలైంది. "సుధర్మా ఎంటర్ ప్రైసెస్ వారు తీయబోయే కొత్త చిత్రంలో నటించబోయే నూతన తార- కుమారి సుప్రియ" అని పరిచయం చేసింది నిర్మల. ఏదోలే. సినిమా తారలాగే ఉంది అని సర్దుకున్నారు జనం. కుమారి సుప్రియ తీయగా నవ్వి. వయ్యారంగా నమస్కారం చేసి. విలాసంగా డబ్బాలో చెయ్యిపెట్టి. గడుసుగా నీలం రంగు బిళ్ళ బయటకు తీసింది. ఆ నంబరు అప్పుడు అందరి ముందూ కూడబలుక్కుని చదివి "బహుమతి డాక్టర్-పంతులుకి వచ్చింది." అని ప్రకటించింది నిర్మల. ఏదో గొడవ జరిగిందని జనానికి కాస్త అను

మానం వచ్చినా, డాక్టర్-పంతులుకే బహుమానం వచ్చిందనేసరికి ఊరుకున్నారు. ఆ వాచ్ అసలు డాక్టర్-పంతులుదేనని అందరికీ తెలుసు. గిరయ్య దానిని దొంగిలించాడనీ, గిరయ్యని కాపాడటానికి తానే గిరయ్యకి దాన్ని బహుమానంగా ఇచ్చినట్లు పంతులు చెప్పాడనీ కూడా తెలుసు. అంచేత ఎవరికో బహుమతి వస్తే బాధపడినంతగా పంతులు వాచ్ పంతులు కొచ్చినందుకు బాధపడలేదు జనం. ఆ సభ లోనే టికెట్లమ్మిన డబ్బుతో కొన్న మూవీ ప్రొజెక్టర్ అందరికీ చూపించి, అందరి తరఫునా దానిని రాత్రి పాఠశాలకు బహూకరిస్తున్నట్లు కూడా ప్రకటించింది నిర్మల. అది కూడా అందరికీ సంతృప్తి కలిగించింది. తమ డబ్బు ఒక మంచిపనికి ఉపయోగించింది. స్వార్థం ఫలించనప్పుడు ఫలించలేదని బాధపడటంకంటె దానిని ఔదార్యంగా మార్చుకుని తమని తాము గొప్ప చేసుకోవటంలో ఎంత సుఖముందో అందరికీ తెలుసు. పాఠశాల తరఫున మూవీ ప్రొజెక్టర్ అందుకున్న పంతులికి నిర్మల దేవతలాగే కనిపించింది.

# 13

డాక్టర్-పంతులు వాచ్ నిర్మల దగ్గిరే ఉంది. ఒక చిన్న పార్టీ ఏర్పాటుచేసి ఆ పార్టీలో వాచ్ డాక్టర్ పంతులికి బహుమానంగా ఇద్దామన్నారు కంపెనీలో అమ్మాయిలు-పాపం. డాక్టర్-పంతులు అందరికీ ఎన్నో రకాలుగా సాయపడ్డాడు. ఎవ్వరి కే జబ్బు వచ్చినా ఫ్రీగా తియ్యటి మందులిచ్చాడు. అంచేత ఇలా పార్టీ ఇచ్చి గౌరవించటం న్యాయమన్నారు. నిర్మల కూడా ఈ సూచనకి సంతోషంగా ఒప్పుకుంది. మిత్రులు నలుగురూ సరస్వతమ్మ దగ్గిరకి చేరారు. ఇంత వరకూ నిర్మలా, పంతులూ పెళ్ళి చేసుకోకపోవడం వాళ్ళకి నచ్చలేదు.

"రేపు పార్టీలో నిర్మలమ్మ పంతులుకి వాచ్ ఇయ్యగానే నిర్మలమ్మా, పంతులూ పెళ్ళి చేసుకోబోతున్నారని చెప్పేద్దాం!" అన్నాడు గిరయ్య.

ఈ ఊహ అందరికీ భలే హుషారుగా తోచింది. అయితే

వెంటనే ఒక సందేహం-ఎవరు చెప్తారు ఆ మాట! దీనికి మాత్రం ఎవరూ ముందుకు రాలేదు. "అమ్మగారే చెప్పాలి!" అన్నాడు కిట్టయ్య. "నేనా!" అంది సరస్వతమ్మ కంగారుపడుతూ...."మీరే! మీరే!" అన్నారు అందరూ. చివరకు ఒప్పుకుంది సరస్వతమ్మ. తాను చెయ్యబోతున్నది మంచి పనే కాని చెడ్డ పని కాదుగా!

ఆ మరునాడు కంపెనీ అమ్మాయిలు పార్టీ చాలా గొప్పగా ఏర్పాటు చేసారు. మిత్రులు సలుగుర్నీ, డాక్టర్-పంతుల్నీ పిలిచారు. సంతోషంతోపాటు ఏదో సంభ్రమంతో ఉక్కిరి బిక్కిరయిపోతున్నారు అందరూ. పార్టీ మొదలవటానికి ముందే నిర్మల పంతులు వాచ్ తీసి "మిమ్మల్ని అదృష్టదేవత వరించింది. మీ వాచ్ మీ కొచ్చింది"అని తనే స్వయంగా వాచ్ అతని చేతికి కట్టింది. పంతులు వెలిగిపోతున్న ముఖంతో "థేంక్స్" అన్నాడు. ఇది చూసిన సరస్వతమ్మకి బాగా ధైర్యం వచ్చింది. పెద్దరికపు హోదాతో "ఈ సంతోష సమయంలో మరొక శుభవార్త! నిర్మలా, పంతులుగారూ పెళ్ళి చేసుకోబోతున్నారు" అంది. పంతులు తెల్లబోయి చూసి అప్రయత్నంగా "ఛీ!" అన్నాడు. నిర్మల రుద్రకాళిలా లేచి "ఛీ! ఛీ! ఛీఛీ! ఛీఛీ! ఛీఛీ! సరస్వతమ్మగారూ! మీకు వయసొచ్చిన కొద్దీ మతిపోతోంది. ఈ వెర్రిపంతులెక్కడ? నేనెక్కడ? ఈ హోమియోపతి మందుల డబ్బా డాక్టర్ని నేను పెళ్ళి చేసుకుంటానా? ఛీ! ఎంత పిరికితనం! దుర్మార్గుణ్ణి భరిస్తాను; దరిద్రుణ్ణి భరిస్తాను; ఈ పిరికివాణ్ణి మాత్రం నేను భరించను." అని వల్లమాలిన కోపంతో ఆ ఇంట్లోంచే వెళ్ళిపోయింది. నిర్మల ఒక్కొక్క మాటా ఒక్కొక్క పిడుగులా నెత్తిన పడుతోంటే చైతన్యం నశించి కూచున్నాడు పంతులు. పంతుల్ని కోపంగా ఏదో అనబోయిన సరస్వతమ్మకి అతని ముఖం చూడగానే సానుభూతి కలిగింది.

"బాధపడకు పంతులూ!" అంది, కాని ఆ ఓదార్పు కూడా వ్యర్థమే అయిపోయింది. అతని జ్ఞానేంద్రియాలేవీ పని చెయ్యటం లేదు.

"పార్టీ అయిపోయాక పెళ్ళి మాట చెప్పవలసింది" తిను బండారాల వంక చూస్తూ బాధపడ్డాడు శివం.

"శాస్త్రిలుగారి జోస్యం తప్పదు. పెళ్ళవుద్ది" అన్నాడు బుజ్జి దృఢ నమ్మకంతో.

"నోరెత్తావంటే తంతాం!" అన్నారు మిత్రులు కోపంతో.

"పెళ్ళవుద్ది!" అన్నాడు బుజ్జి మొండిగా. మిత్ర బృందం అతణ్ణి తన్నేవాళ్ళే! అంతలో పంతులు బుజ్జి దగ్గరకొచ్చి "బుజ్జీ బంగారు తండ్రీ-ఏమన్నావు? మళ్ళీ అను." అన్నాడు.

"నీకూ నిర్మలకూ పెళ్ళవుద్ది?"

"మళ్ళీ అను."

"పెళ్ళవుద్ది."

"థేంక్యూ!"- పంతులు సంతోషంగా వెళ్ళిపోయాడు ఎవరితో ఏమీ చెప్పకుండా. మిగిలిన వాళ్ళు ఒకరి మొహం మరొకరు చూసుకున్నారు.

# 14

బుజ్జిగాడి లవ్వర్ కాసులయ్య కాఫీ హోటల్‌కి వస్తూ పోతూనే ఉంది. ఆవిడ రావటం పగటి వేళే వస్తుంది. కాని పోవటంమాత్రం, అర్ధరాత్రివేళ పోతుంది. ఆవిడ ఏ వేళప్పుడు పోయినా బుజ్జి ఆవిడతో పాటు రిక్షాలో వెళ్ళి రైలెక్కించి వస్తాడు. అప్పుడప్పుడు బుజ్జిగాడు ఆవిడ గదిలోకి వెళ్ళి కబుర్లు కూడా చెపుతున్నాడు. ఆవిడ నవ్వుకుంటూ వాడి మాటలన్నీ వింటుంది. అక్కడి విశేషాలన్నీ అడుగుతుంది. వాడికి పరమానందంగా ఉంది. ఆవిడ తన మాటలకి నవ్వితోంటే 'అబ్బ! ఎంత లవ్వో!" అని మురిసిపోతాడు. ఆ రోజూ బుజ్జిగాడు యథాప్రకారం తన లవ్వర్ రూంలో కూచుని తన మాటలతో ఆవిణ్ని నవ్విస్తూ తను ఆనందిస్తున్నాడు. ఆ సమయంలో అక్కడికి వచ్చాడు పార్ట్నర్. పార్ట్నర్ బుజ్జిగాడిని చూసి ముఖం చిట్లించి "వాడిని పొమ్మను." అన్నాడు. ఆ అమ్మాయి "బుజ్జీ! ఇంక నువ్వు వెళ్ళు. మేం మాట్లాడుకోవాలి!" అంది. బుజ్జిగాడికి వల్లమాలిన కోపం వచ్చింది. వాళ్ళు మాట్లాడుకోవటానికి తను వెళ్ళటం

దేనికి? "నేను పోను!" అన్నాడు ముద్దుగా....వాడి ముద్దు మురిపాలు ఆవిడముందు పనిచెయ్యలేదు. "ఏయ్! అవతలికి పో!" అని ఒక్క కసురు కసిరింది కోపంగా. బుజ్జిగాడు బిక్కచచ్చిపోయి కళ్ళలో గిరగిర నీళ్ళు తిరుగుతుండగా బయటికొచ్చేసాడు. వాడు చూస్తూండ గానే ఆ అమ్మాయి తలుపులు మూసేసుకుంది పార్ట్నర్ని లోపల పెట్టుకుని. బుజ్జిగాడికి ఆపాదమస్తకమూ మండిపోయింది. ఈ అన్యా యానికి ఎలాగయితే ప్రతీకారం చెయ్యాలి. ఎలా? వాడికి నిర్మల గుర్తుకొచ్చింది. నిర్మల తలుచుకుంటే ఏమైనా చెయ్యగలదు. అప్పుడు పార్ట్నర్ని హాస్పిటల్కి పిలిపించి పంతులికి క్షమాపణ చెప్పించలా? నిర్మల దగ్గరికొచ్చి బావురుమని ఏడ్చేసాడు బుజ్జి. నిర్మల కంగారు పడుతూ "ఏమయింది? డాక్టర్-పంతులు ఎలా వున్నాడు?" అంది. బుజ్జి కళ్ళు తుడుచుకుని "పంతులు బాగానే వున్నాడు. నేను వెళ్ళ వద్దని చెప్పాగా!" అన్నాడు.

"మరి ఎందుకు ఏడుస్తున్నావు?"

"నా లవ్వర్ని పార్ట్నర్ లవ్ చేస్తూన్నాడు!"

తెల్లబోయింది నిర్మల. నెమ్మదినెమ్మదిగా బుజ్జిగాడిని ప్రశ్న లడిగి మొదటినుంచీ అన్ని విషయాలూ తెలుసుకుంది. అన్నీ చెప్పి "దొరసానమ్మా! నువ్వెట్టాగయినా ఆ పార్ట్నర్గాడికి బుద్ధిచెప్పాల" అని ప్రాధేయపడ్డాడు బుజ్జి. "తప్పకుండా బుద్ధి చెపుతాను." అని అభయమిచ్చింది నిర్మల.

# 15

నిర్మల రాత్రి తెల్లవార్లూ నిద్రపోలేదు. అశాంతిగా అటూఇటూ తిరుగుతోనే వుంది. తన గదిలోంచి అదంతా గమనించిన సరస్వ తమ్మ స్థిమితంగా వుండలేకపోయింది. తెల్లవారగానే పంతులుకి కబురు చేసింది నిర్మల అనారోగ్యం గురించి. కబురందుకోగానే వచ్చాడు పంతులు. నిర్మల కళ్ళు పంతుల్ని చూడగానే చల్లబడ్డాయి. కను బొమలు ముడిచి "ఎందుకొచ్చారు!" అంది.

"మీకు రాత్రి తెల్లవార్లూ నిద్రలేదని తెలిసి వచ్చాను."

నిర్మల కళ్ళు పెద్దవి చేసి చూసింది.

"మీకు సుఖంగా నిద్రతెప్పించే మందు నా దగ్గిరుంది."

"గెటౌట్!" కోపంగా అంది నిర్మల. ఆ కోపానికి ఏ మాత్రం జంకలేదు పంతులు.

"నేను అల్పుణ్ణే! కానీ, నా మందులు చాలా మంచివి. ఇవిగో ఈ మాత్రలు గంటకి మూడు చొప్పున తీసుకోండి. రాత్రికి బాలా రిలీఫ్ కనిపిస్తుంది."

చిన్న సీసా తీసి బల్లమీద పెట్టాడు పంతులు. ఆ సీసానీ. పంతుల్నీ మార్చిమార్చి చూసింది నిర్మల.

"నాకు మీరంటే చాలా అసహ్యం. తెలుసా:"

"తెలుసు!"

"మరి ఎందుకొచ్చారు?"

"నాకు మీరంటే అసహ్యం లేదుగా!"

"లేదా?"

"ఏ మాత్రం లేదు."

"మనుష్యులు "ఛీ!" అనే దాన్ని ఎప్పుడు. ఏ సందర్భంలో వాడతారు?"

"రెండు రోజులుగా నే నీ విషయాన్నే ఆలోచిస్తున్నాను. "ఛీ!" గురించి కాదు, మనుష్యుల మనసుల గురించి....అందరికీ మంచేదో, చెడ్డేదో చక్కగా తెలుసు. కానీ. ఏ ఒక్కరూ తమకు మంచి అని తోచినదానినే ఏనాడూ పాటించలేరు. అవ్యాజ్యమైన ఆనందాల కోసం మనసు ఆత్రుత పడుతూంటే తనను తాను ఆచారాల సుడిగుండాలలోకి తోసుకుని ఉక్కిరిబిక్కిరి అయి పోతుంటాడు. ఒక్కడు కూడా తన మనసు చెప్పినట్లు-తన మనసుకు నచ్చినట్లు. తన మనసు కోరినట్లు జీవించలేడు. ఎక్కడికక్కడ మిధ్యా నాటకం అభినయిస్తూ అదే జీవితం అని భ్రమపడిపోతున్నాడు. ఏ క్షణంలోనయినా ఈ మిథ్యా నాటకాల మధ్య భ్రమలు విచ్చి సత్యం మెరుపులా మెరిసినపుడు తనను తాను చూసుకొని "ఛీ!" అనుకుంటాడు. అదే ఈ 'ఛీ'...."

నిర్మల ఆశ్చర్యంగా చూసింది పంతుల్ని. ఆ ముఖంలో కని పించే అమాయకత్వం ఆవిడ ఆశ్చర్యాన్ని ఆరాధనగా మార్చేసింది. చూస్తూండగా నిర్మల కళ్ళలో నీళ్ళు తిరిగిపోయాయి.

"పంతులూ! వెళ్ళిపో ఇక్కడినుంచి...." అంది.

పంతులు మూఢుడిలా చూస్తూ "నేను మిమ్మల్ని...." అంటూ ఏదో అనబోతుంటే మాటల్ని పూర్తి చెయ్యనియ్యలేదు నిర్మల.

"ప్లీజ్, వెళ్ళిపో పంతులూ! నా వృత్తి వేరు! నా జీవితం వేరు! నా ముందు నిలబడి నా మనసు బలహీనం చెయ్యకు. వెళ్ళిపో! వెళ్ళిపో!" పిచ్చిదానిలాగ అరిచింది నిర్మల. తలవంచుకుని బయటకు వచ్చేసాడు పంతులు. దీనంగా వున్న అతని ముఖం చూసేసరికి సరస్వతమ్మకి కడుపు తరుక్కుపోయింది. ఆవిడలో మాతృత్వపు మమకారం మేల్కొంది. "పంతులూ!" అంది ఆప్యాయంగా. ఆ పలకరింపుకు పంతులు ఆవేదన రెట్టింపయింది.

"అమ్మగారూ! నిర్మల నన్ను క్షమించలేకపోతోంది. అది న్యాయమేలెండి. మళ్ళీ ఇక్కడకు వస్తానో రానో. దయవుంచండి." అని చేతులు జోడించి వెళ్ళిపోయాడు. సరస్వతమ్మకి ఏడుపొచ్చింది. నిర్మలపైన పట్టరాని కోపమొచ్చింది.

"నిర్మలా: ఏమిటిది?" అంది అతి కష్టంగా....

"ఏమిటి?" అంది నిర్మల తాపీగా కళ్ళు తుడుచుకుని....

"పంతులు చాలా మంచివాడు."

"కాదని ఎవరన్నారు?"

"నిన్ను ప్రేమిస్తున్నాడు."

"ఓహో!"

"నీకు మాత్రం అతనిమీద ప్రేమ లేదా?"

"ఇప్పుడు ప్రేమా, గీమా ఆలోచించే తీరికలేదు నాకు!"

"నిర్మలా! నా మాట విను. అతణ్ని పెళ్ళి చేసుకో!"

"ఇప్పుడు నా దగ్గిర పెళ్ళిమాట ఎత్తొద్దని చెప్పలేదూ? పెళ్ళి గురించి కాదు నేను ఆలోచించవలసింది! చికాకు పెట్టకండి!"

"నిర్మలా!...."

"సరస్వతమ్మగారూ! మీరు మన కంపెనీ నిబంధనలు మరిచి

పోతున్నారు. ఇక్కడ ఎవ్వరినీ, ఏ విధంగానూ నిర్బంధం చేయ డానికి వీల్లేదు. నేనసలు మీ దగ్గిరుండను. వెళ్ళిపోతున్నాను."

నిర్మల అప్పటికప్పుడు సూట్ కేస్ సర్దుకుని బయలుదేరింది.

సరస్వతమ్మగారూ, మిగిలిన అమ్మాయిలు కూడా తెల్ల బోయారు. వాళ్ళు అంతకుముందెప్పుడూ సరస్వతమ్మగారూ, నిర్మలా ఘర్షణ పడగా చూడలేదు.

సరస్వతమ్మగారు గాభరాగా "నిర్మలా, ఎక్కడికి?" అన్నారు.

"కాసులయ్య కాఫీ హోటల్లో నేనూ ఒక గది తీసుకుని వుంటాను." సరస్వతమ్మగారు "నిర్మలా! నిర్మలా!" అని పిలుస్తున్నా వినిపించుకోకుండా నిర్మల వెళ్ళిపోయింది. క్షణాలలో ఈ వార్త చిల వల పలవులతో అంతటా వ్యాపించింది.

# 16

తన సూట్ కేస్‌తో నిర్మల హోటల్లో ప్రవేశించేసరికి పార్ట్నర్ తెల్ల బోయాడు. కాసులయ్య హడలిపోయాడు.

"ఇట్టాంటోళ్ళని మన హోటల్లో వుండనియ్యకూడదుగురూ!" అని హెచ్చరించాడు పార్ట్నర్ని కాసులయ్య.

"నేను అట్లాంటిదాన్ని కాదు" అంది రోషంగా నిర్మల.

"ఇట్లాంటోళ్ళంతా అట్లాంటోళ్ళం కామనే అంటారు." అన్నాడు కాసులయ్య లోకజ్ఞతతో.

"సరస్వతమ్మ నన్ను పంతుల్ని పెళ్ళాడమంది. నా కిష్టంలేదు. పంతులు నన్ను 'ఛీ!' అన్నాడు. నన్ను 'ఛీ' అన్నవాణ్ణి నేనెందుకు పెళ్ళాడతాను?"

"ఒక్క 'ఛీ'కే నువ్విలా అయిపోతే నిన్ను పెళ్ళాడితే పంతులు ఎన్ని 'ఛీ, ఛీ' లు తినాలో నీకేం తెలుసు?"

"అందుకే ఎవరికీ ఏ 'ఛీ, ఛీ' లు వద్దని వచ్చేశాను."

"మాకు మాత్రం ఎందుకీ 'ఛీ, ఛీ!' లు? మరెక్కడికైనా వెళ్ళు."

పార్ట్నర్ నవ్వుకుంటూ ఈ సంభాషణంతా వింటున్నాడు.

నిర్మల పార్ట్నర్ వైపు తిరిగింది.

"చూడండీ: ఈ కాసులయ్య ఏమంటున్నాడో! నేను అట్లాంటి దాన్ని కానూ" అంది గారాలుపోతూ.

"నాకు తెలీమా!" అన్నాడు పార్ట్నర్ నవ్వుకుంటూ.

"సరస్వతమ్మగారితో పోట్లాడి వచ్చాను. మళ్ళీ అక్కడికి వెళ్ళాలని లేదు. మీకీ హోటల్లో ఉండనియ్యకపోతే ఏమయిపోనూ?" అంది నిర్మల ఏడుపు గొంతుకతో.

"ఏమీ అయిపోవద్దు. ఈ హోటల్లోనే ఉండు" అన్నాడు పార్ట్నర్ దర్పంగా. తన గది ప్రక్కనున్న గదినే ఇచ్చాడు నిర్మలకి.

నిర్మల కాసులయ్య కాఫీ హోటల్లో గది తీసుకుని ఉందనే వార్త నలుగురు మిత్రులకీ తెలిసిపోయింది. ఈ వార్త మోసుకుని మిత్ర బృందం పంతులు దగ్గిరకు వెళ్ళారు. విషయం వింటూనే కొయ్యబారిపోయాడు పంతులు.

"నిర్మలమ్మ మంచిదనుకున్నాం! అందరిలాంటి కంపెనీ మనిషే ! డబ్బు కోసం ఆ పార్ట్నర్‌గాడి వెంట పడింది." అన్నారు.

"నోరు ముయ్యండి! నిర్మలనేమైనా అన్నారంటే చంపేస్తాను-నిర్మల మంచిది" పట్టరాని కోపంతో అన్నాడు పంతులు.

గతుక్కుమని నోరు మూసుకున్నారు నలుగురూ.

ఆ రాత్రి ఎనిమిది గంటలకు నిర్మల గది తలుపు తట్టాడు పార్ట్నర్. తలుపు తెరిచింది నిర్మల. "నిర్మలా!" అంటూ లోపలకు అడుగుపెట్టబోయిన పార్ట్నర్ మంచం మీద పడుకున్న పురుషాకృతిని చూసి తెల్లబోతూ "ఎవరూ!" అన్నాడు కోపంగా.

నిర్మల నోటి మీద వేలుంచి "హుంష్! గట్టిగా అరవకు! పంతులు నిద్రపోతున్నాడు" అంది.

మతిపోయింది పార్ట్నర్‌కి. "ఈ హోటల్లో ఇట్లాంటియి సాగవు బొమ్మను" అన్నాడు కోపంగా.

"ఇట్లాంటియి సాగవు" అని చెప్పటానికే రాత్రివేళ తలుపు తట్టావా?" వెటకారంగా అంది నిర్మల. గుర్రుమని చూసాడు పార్ట్నర్.

"ఆ పంతుల్ని ఇక్కడినుంచి పంపెయ్యి-లేకపోతే నువ్వూ పో!"

"ఇప్పుడు జ్వరంగా ఉంది-కదపను."

"రేపు పంపెయ్యి."

"తగ్గితే తప్పకుండా పంపిస్తాను." వినయంగా అంది. విసురుగా వెళ్ళిపోయాడు పార్ట్నర్.

పంతులు నిర్మల గదిలోకి అలా అకస్మాత్తుగా రావటానికి కారకులు నలుగురు మిత్రులు. పంతులు కసురుకున్నాక బయటికొచ్చి "నిర్మలమ్మ చాలా చాలా చెడ్డది" అన్నాడు గిరయ్య చాలా కోపంగా తన వాచ్ (ఆ వాచ్ తనదేననే అభిప్రాయానికొచ్చేశాడు గిరయ్య) పంతులు కిప్పించినప్పటినుండీ నిర్మల మంచిదనే అభిప్రాయం కాస్త సడలింది గిరయ్యలో. "కాదు నిర్మలమ్మ మంచిది" అన్నాడు బుజ్జి అంతకంటె కోపంగా. కిట్టయ్య బుజ్జి పక్షానికీ, సింహం గిరయ్య పక్షానికి చేరిపోయి తన్నుకోవటంవరకూ వచ్చారు. చివరికు కిట్టయ్యకు ఒక ఉపాయం తోచింది. "మనం పోయి నిర్మలమ్మతో పంతులుకి జ్వరం వచ్చిందని చెప్దాం! నిర్మలమ్మ నిజంగా మంచిదయితే వెంటనే పంతులు దగ్గిరకు వచ్చేస్తుంది" అన్నాడు. ఈ సూచనకి అందరూ ఒప్పుకున్నారు. నలుగురూ దిగులుగా ఉన్న పంతులు ముఖం చూడ లేకపోతున్నారు. నిర్మలమ్మ పంతులు దగ్గిర కొచ్చేస్తే, అంతకంటె కావలసినదేముంది? ఈ నలుగుర్నీ కాసులయ్య తన హోటల్ గదుల దగ్గికి రానియ్యలేదు-గిరయ్య పిడికిలి బిగించి "లోపలికి పోనియ్యక పోతే...." అంటుండగానే కాసులయ్య లాఠీ కర్ర అందుకున్నాడు. గిరయ్య తగ్గిపోయాడు. ఆ ఘర్షణ విని నలుగుర్నీ చూసి నిర్మలే వాళ్ల దగ్గిరకి వచ్చింది. "నిర్మలమ్మా! పంతులుకి జ్వరం వచ్చింది" అని చెప్పారు. ఆ మాట వింటూనే ఉన్నది ఉన్నట్లుగా పంతులు దగ్గిరకు బయలుదేరింది నిర్మల. బుర్ర వేడెక్కటంవల్ల నుదురు కూడా కాస్త వేడెక్కింది పంతులుకి, ఆ నుదుటి మీద చెయ్యివేసింది నిర్మల. "కాలిపోతుంది" అంది బాధగా. కళ్ళు మూసుకు పడుకున్న పంతులు కళ్ళు తెరిచాడు. "మీకు జ్వరం వచ్చింది" అంది నిర్మల.

"ఏదో వచ్చింది. జ్వరమే కావచ్చు."

"మీరు నాతో వచ్చెయ్యండి."

"పద!"

అలా నిర్మల వెంట కాసులయ్యా కాఫీహోటల్లో గది కొచ్చేసాడు. నిర్మల చెయ్యి పట్టుకుని "నన్ను వదిలి వెళ్లకు నిర్మలా!" అన్నాడు.

నిర్మల బడలికగా ఉన్న అతని ముఖంలోకి ప్రశ్నార్థకంగా చూస్తూ "నేను వేశ్యను. తెలుసునా?" అంది. పంతులు ముఖం తిప్పుకున్నాడు. "నువ్వు నిర్మలవని తెలుసును" అన్నాడు.

"కాంపడీపి వేశ్యను పెళ్ళాడి సంస్కర్త కావాలనుకుంటున్నారా?"

"ఉహూ! సంస్కర్త కావాలని నాకేంలేదు? నాకు కావలసింది నిర్మల. ఆ నిర్మల ఎక్కడవున్నా. ఎలావున్నా నిర్మలే నాకు."

అతని కళ్ళలోకి చూసి నవ్వింది నిర్మల. "ఇక పడుకోండి" అంది. నిశ్చింతగా నిద్రబోయాడు పంతులు. ఆ తరువాత పార్ట్నర్ వచ్చిందికూడా అతనికి తెలియదు.

సరస్వతమ్మకి పంతులుకి జ్వరం వచ్చినట్లు తెలిసింది. వెంటనే చూడటానికి వచ్చింది. ఆవిడతోపాటు కంపెనీ అమ్మాయిలూ వచ్చారు. ఇదంతా చూసి కాసులయ్య నెత్తీ నోరు కొట్టుకుంటూ "ఈ కంపెనీ మేళమంతా ఇక్కడ చేరింది. ఇంక నా హోటల్ నడిచినట్లే!" అని గోల పెట్టాడు. అతడి గోల ఎవరూ పట్టించుకోలేదు. పార్ట్నర్‌కి యిదంతా చికాగ్గానే వుంది. కాని కాసులయ్యలా బయటపడలేదు. "నేను నిర్మలతో మాట్లాడతాలే. వీళ్ళని మళ్ళీ రానీయను" అని కాసులయ్యను ఓదార్చాడు పార్ట్నర్.

"పంతులూ!"అని ఆప్యాయంగా పలకరించింది సరస్వతమ్మ.

"జ్వరం వచ్చిందా?" అని జాలిపడుతూ "నీకు జ్వరం తగ్గే వరకు ఇక్కడేవుండి సేవచేస్తాను." అని ప్రకటించింది.

"మేమూ యిక్కడే వుండి సేవలుచేస్తాం" అన్నారు అమ్మాయిలు. హడిలిపోయాడు పంతులు.

"అమ్మగారూ!నాకో సాయంచెయ్యగలరా?"అన్నాడు దీనంగా.

"చెప్పు పంతులూ! నీకోసం ఏంచెయ్యమన్నా చేస్తాం"అంది సరస్వతమ్మ-ఎలాంటి త్యాగానికయినా సిద్ధపడుతూ.

"మీ కోసం మా ప్రాణాలు యిస్తాం!" అన్నారు అమ్మాయిలు. అది ఎలాగూ ఎవరూ అడగరనే ధైర్యంతో.

పంతులు చేతులు జోడించి "నన్ను కనికరించి మీరంతా ఇక్కణ్నించి వెళ్ళిపొండి." అన్నాడు. అందరికీ ఆశాభంగం కలిగింది, కోపమూ వచ్చింది. కోపంగా పంతులు ముఖంలోకి చూడబోతే నవ్వొచ్చేసింది. అమ్మాయిలు నవ్వుకుంటూ వెళ్ళిపోయారు. సరస్వతమ్మ కొంచెంసేపు కూర్చుని నిర్మలతో మాట్లాడి వెళ్ళిపోయింది.

సరస్వతమ్మ వెళ్ళిపోగానే పార్ట్నర్ కోపంగా వచ్చారు.

"ఏమిటీ మేళమంతా ఇక్కడ? పంతుల్ని పంపించేస్తావా, లేదా?"

"ఎలా పంపను? జ్వరం!"

"ఓహో! అయితే పోలీస్ రిపోర్టు యిస్తాను. ఆ జ్వరం సంగతేదో పోలీసులే తేలుస్తారు!"

"నిజంగా పోలీస్ రిపోర్టు యిస్తావా?" దీనంగా అడిగింది.

"ఇంకో అరగంటలో పంపెయ్యకపోతే తప్పకుండా ఇస్తాను."

కోపంగా వెళ్ళిపోయాడు పార్ట్నర్. అతడు వెళ్ళిపోగానే పంతులు లేచి "నేను వెళ్ళిపోతున్నాను" అన్నాడు.

"ఏమిటి?"

"నాకు జ్వరంలేదు. వున్నా ఇక్కడ వుండను. ఈ గొడవ, పోలీస్ రిపోర్టులు ఇదంతా....ఛీ! ఛీ...."

"ఛీ! అనుకుంటూ నన్ను వదలి వెళ్ళిపోతారా?"

"నువ్వుమాత్రం ఈ 'ఛీ' తో ఎందుకుండాలి? నాతో వచ్చెయ్"

"నేను రావడానికి వీల్లేదు."

"అయితే నేను వెళ్ళిపోతాను"

"నన్ను ఒక్కదాన్నే వదలి వెళ్ళిపోతున్నారా? నా ఆపదలో అండగా నిలబడలేరా? పోలీసులకు అంతగా భయపడుతున్నారా?"

అయోమయంగా చూసాడు పంతులు. "నువ్వేం మాట్లాడుతున్నావో నాకు అర్థం కావటంలేదు." అన్నాడు.

"ప్రస్తుతం మీరిక్కడ వుండటం నాకు అవసరం. ఇందువల్ల ఇబ్బంది కలగొచ్చు. నాకోసం ఆ మాత్రం భరించలేరా? మీ దయ...."

పంతులు మళ్ళీ మంచంమీద కూర్చున్నాడు. "ఏదెలా జరిగితే అలా జరగనీ! నేను వెళ్ళను" అన్నాడు

పంతులు వెళ్ళకపోవటం చూసి పార్ట్నర్ చాలా కోపంగా

"నేను ఇప్పుడే పోలీస్ రిపోర్ట్ ఇస్తున్నాను—" అన్నాడు. నిర్మల జాలిగా చూపింది. ఆ చూపులకు కరగలేదు పార్ట్నర్. పళ్ళు నూరుకుంటూ వెళ్ళాడు. ఆరోజే పోలీసులు అకస్మాత్తుగా కాసులయ్య కాఫీహోటల్ పైన రైడ్ చేసారు. నిర్మల, "అన్నంతపనీ చేసావుకదూ! పోలీస్ రిపోర్ట్ ఇచ్చావుకదూ!" అంది పార్ట్నర్‌తో నవ్వుతూ. పార్ట్నర్ పాలి పోయిన ముఖంతో నిర్మల నవ్వుముఖాన్ని లోతుగా చూస్తూ "నువ్వు నువ్వు...." అన్నాడు. నిర్మల పకాలున నవ్వి "ఇప్పటికీ అర్థంకాలేదా! నేను సి. ఐ. డి. ఆఫీసర్ని" అంది. పంతులు గాభరాగా "నువ్వు.... నువ్వు...." అన్నాడు. నిర్మల నవ్వి "మీ నిర్మలవి" అంది. పోలీసులు కాసులయ్యనీ, పార్ట్నర్‌నీ, బుజ్జిగాడి లవ్వర్‌నీ, ఇంకా మరికొందరినీ అరెస్ట్ చేసారు. కాసులయ్య కాఫీహోటల్లో రహస్యంగా నాటు బాంబులు తయారుజేసి రవాణా చేస్తున్నారని రుజువయింది.

తన లవ్వర్‌ని పోలీసులు పట్టుకుపోతుంటే బుజ్జిగాడు ఏడ్చాడు.

"ఏడవకు. నీకు మంచి ఉద్యోగం చూస్తాను." అంది నిర్మల. ఉద్యోగంమాట వినగానే బుజ్జిగాడి ప్రేమ 'ఉఫ్' మని ఎగిరిపోయింది!

# 17

"పంతులూ! 'సుధర్మ' అంటే ఏమిటో తెలుసా? దేవసభ. రంభ, ఊర్వశి మొదలైన దేవ వేశ్యలు తమ విలాసాలు గుమ్మరించే స్థలం. సంయమీంద్రులు తమ తపశ్శక్తితో తప్పొప్పులు నిర్దేశించే సభాస్థలి. ముల్లోకాలూ పాలించే దేవేంద్రుడికి సుధర్మ మార్గాన్ని ఉపదేశించ గలిగే బృహస్పతివంటి మేధావులకు నిలయం. అందుకే మా కంపెనీకి 'సుధర్మ' అని పేరు పెట్టుకున్నాం. అక్కడున్న అమ్మాయిలలో చాలామంది ఆదివరలో వ్యభిచారవృత్తిలో వున్నవారే! ఆ కారణం చేత 'సుధర్మ' బ్రోతల్ అని భ్రమపడటానికి వీలు చిక్కింది. నిజా నికి మాది బ్రోతల్ కాదు. సరస్వతమ్మగారు ఆ అమ్మాయిలను సంస్కరించి, ఆత్మవిశ్వాసం కలిగించి, కొత్త జీవితంలో ప్రవేశ పెట్టాలని కృషి చేస్తున్నారు. మా ప్రార్థన విన్నారుగా! మా అమ్మా

యిల కృషి, వాళ్ళలో పరివర్తన చూసారుగా. మాది బ్రోతల్ కాదు కనుక, మామూలు బ్రోతల్స్‌లా వుంగక మీకు విడ్డూరంగా కనిపించింది. అప్పుడప్పుడు నా కోసం వచ్చిన యువకులు మా డిపార్ట్‌మెంట్‌లో వ్యక్తులే. ఈ ప్రాంతాలలో ఆయుధాలు దొంగతనంగా తయారుచేసి రహస్యంగా రవాణా చేస్తున్నట్లు స్పెషల్ బ్రాంచికి సమాచారం అందింది. ఆ ఆచూకీ తియ్యమని నన్ను పంపించారు. బుజ్జిగాడి 'లవ్ ఎఫైర్' ధర్మమా అని కాసులయ్య కాఫీ హోటల్‌ని అనుమానించాను. సరస్వతమ్మగారితో దెబ్బలాడినట్లు ఆ హోటల్‌లో ప్రవేశించాను. అక్కడ నాటు బాంబులు తయారు చేస్తున్నారని గ్రహించాను. సరస్వతమ్మగారిద్వారా సమాచారాన్ని డిపార్ట్‌మెంట్‌కి అందజేసాను. ఇదీ 'సుధర్మ' రహస్యం. ఇప్పుడు చెప్పండి. మీరు నన్ను పెళ్ళిచేసుకుంటారా?"

నిర్మలను కొత్తగా, బెదురుగా చూసాడు పంతులు.

"నేను మీకు తగినవాణ్ని కాదు." అన్నాడు.

"ఆ మాట అనకండి. నా జీవితంలో ఇంతవరకూ మీలాంటి వ్యక్తిని కలుసుకోలేదు. నేను వేశ్యనని అనుకున్నప్పుడు కూడా ఎప్పుడూ నన్ను 'మీరు' అనే సంబోధించారు. ఏనాడూ కూడని చనువు తీసుకోవటానికి ప్రయత్నించలేదు. చిన్నబుచ్చలేదు. వేశ్యననే దృష్టి లేకుండా మనస్ఫూర్తిగా ప్రేమించారు. వేశ్యలయినా, కూలివాళ్ళయినా, చదువుకున్నా, చదువుకోకపోయినా అందరినీ సాటి మనుష్యులుగా గౌరవించి ఆదరించారు. మీలాంటి వ్యక్తికి భార్య కావటం నా అదృష్టమనే అనుకుంటున్నాను. ఒకవేళ మీరే నేను మీకు తగినదాన్ని కాననుకుంటే....మీకే నేనంటే ఇష్టంలేకపోతే...."

ఇంక వినలేనట్లు, మాట్లాడలేనట్లు చేతులు జాపాడు పంతులు. చిరునవ్వుతో ఆ చేతుల మధ్యకు వచ్చేసింది నిర్మల.

— అయిపోయింది —



# మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA133M128 |
| పుస్తకం పేరు | నవలా స్నేహ |
| తారీఖు | 31/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | [illegible] |
| మొత్తం పేజీలు | 73 |
| పెద్ద సైజు పేజీలు | no |
| ఖాళీ పేజీలు | [illegible] |
| లేని పేజీలు | 21,22 |
| తయారు చేసినది | Sumitha |
| పేజీలు విడదీసినది | Thasin |
| స్కాన్ చేసినది | Ruksana |
| పరీక్ష చేసినది | HASEEMA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | Good |